# అరక్షణీయము

[నవల]

మూలం:
శరత్ బాబు

స్వేచ్ఛానువాదం:
'వాల్మీకి'

ప్రచురణ:

జ్యోతి కార్యాలయం,

మద్రాసు-17.

మొదటి ముద్రణ
3,000 కాపీలు

ఫిబ్రవరి
1956

---



# ఎనిమిది అణాలు



ముద్రణ:
యం. వి. యస్. ప్రెస్, మద్రాసు-1.

# అరక్షణీయ

'చిన్నత్తయ్యా! మా అమ్మ ప్రసాదం పంపింది. తీసుకో!'

'ఎవరూ?' అన్నది దుర్గమణి వంటింట్లో నుంచి బైటికి వస్తూ. 'అతులుడా! రా నాయనా!!'

అతులుడు ఆమెకు నమస్కరించి, పాదరజాన్ని శిరసా ధరించాడు.

'ఆరోగ్య వంతుడివి కా నాయనా! చిరకాలం వర్ధిల్లు' అని దీవించింది దుర్గమణి. 'జ్ఞానదా! నీఅతులుడు తిరిగి వచ్చాడు. కూచుందు కేదైనా ఆసనం వెయ్యి. ప్రసాదం కూడా పుచ్చుకెళ్లు.'

కాస్సేపాగి అన్నది—

'రాత్రి తొమ్మిదిన్నర, పది గంటల ప్రాంతంలో, ఈ దోవన గుర్రబ్బండి పోతున్న చప్పుడు వినిపించింది. ఎవరో చూదామని అనుకొని కూడా మానేశాను. అక్కయ్య గారని తెలిస్తే వెళ్ళి, ఆమె పాదధూళి తీసుకోకుండా ఉండను! అక్కయ్య లాంటి మనుషులు — ఈ ప్రపంచంలో ఎక్కడన్నా కనిపించుతారూ?...సరేలే నాయనా! ఈ గొడవ ఎప్పుడూ మనకున్నదే గానీ, అక్కయ్య ఎలా ఉన్నది? ఆరోగ్యంగానే ఉన్నది గదా! మీరిప్పుడు రావడం...పూరీ నుంచే గదూ." అన్నది దుర్గమణి; అప్పటికీ జ్ఞానద రాక పోయే సరికి ఇంట్లోకి చూస్తూ—'ఏం చేస్తున్నావే జ్ఞానదా? అతులుడింకా నిలబడే ఉన్నాడు. త్వరగా రా!'

ఈ రెండవ పిలుపుతో, లోపలి నుండి, పది పన్నెండేళ్ల పిల్ల, ఒక ఆసనం పట్టుకొచ్చి, సాధ్యమైనంత మేరకు తల వంచుకొనే, అక్కడే ఆసనం వేసి, అతులునికి నమస్కరించింది. జ్ఞానద అతన్ని చూడ లేదు. కనీసం మాట్లాడనన్నా మాట్లాడ లేదు. ప్రసాదపు ఆకు దొన్నెను తీసుకొని లోపలి కెళ్లి పోయింది.

పరిశీలనగా చూసిన వారికి, జ్ఞానద హాసన్ముఖి యని తెలిసిపోతుంది. ఇదే సమయాన అతులుని పెదవులపై చిరునవ్వుల పొటమరింపును గూడా గుర్తించ వచ్చు.

అతులుని తండ్రి, కొంత కాలం జడ్జీగా పని చేశాడు. ఆ కాలం లోనే ఆయన గారు చాలా డబ్బు కూడ బెట్టాడు గూడాను. ఆ డబ్బుతో ఆయనగారు కొన్ని జమీలను గూడా కొన్నాడు. నాలుగేళ్ళ క్రిందటే స్వర్లోక వాసి యైనాడు. అతులుడు రెండు నెలల క్రిందట బి. యే. ప్యాసయ్యాడు. పరీక్షా ఫలితాలు తెలియగానే, తల్లితో సహా తీర్థ యాత్రలు చేసి, రాత్రే ఇంటి కొచ్చాడు. తాము చేసిన తీర్థయాత్రా విశేషాలను, వైన వైనాలుగా ఇప్పుడు దుర్గమణికి చెబుతున్నాడు.

'నేనో పాపిష్టి దాన్ని నాయనా!' అన్నది దుర్గమణి అంతా విన్న తరువాత. 'ఏ తీర్థానికి వెళ్ళినా, వెళ్ళక పోయినా, ఒక్కసారి—ఆ కాశీ క్షేత్రాన్ని దర్శిద్దామని ఉన్నది. కానీ ఈ జన్మకు నాకా యోగం ఉన్నదో లేదో మరి—'

'చిన్నత్తయ్యా! మనస్సును నిగ్రహించుకొని, అన్నిటినీ త్యజించి వెడితేనే, పుణ్యమైనా, పురుషార్థమైనా! లేదా—నువ్వు కాశీ వెళ్ళు, రామేశ్వరం వెళ్ళు, ఎంత మాత్రం లాభం లేదు. నేను మా అమ్మను, అలా బలవంతం చేసి, తీసు కెళ్ళక పోతే, ఆమె గారీ జన్మలో ఇవన్నీ చూసి ఉండేది కాదు.'

'నాయనా! నీ కన్నీ తెలుసు...కాబట్టే తల్లిని బలవంతంగానైనా తీసుకెళ్ళావు. నన్నెవరు బలవంత పెడతారు? మీ మామగారికా, ముప్ఫయ్ రూపాయల జీతమాయె. ఆ ముప్ఫయ్ రూపాయల్లోనే, పొట్టా, బట్టా, వచ్చీ పోయే చుట్టాలు,...ఇవన్నీ జరుగుకోవాలాయె! ఇందులో—మళ్లా ఎవరన్నా జబ్బుపడితే, మందులనీ, మాకులనీ,...ఎన్ని గొడవలో చూడు!

ఇక ఇందులో మిగిలి చచ్చేదేమిటి? నేను యాత్రలు చేసేదేమిటి? అందులో—పిల్ల దానికి పద మూడో సంవత్సరం కూడా ప్రవేశించింది. పెళ్ళీ గిళ్ళీ... నువ్వేమయినా అనుకో నాయనా! పిల్లది తలపు కొచ్చినప్పుడల్లా నెత్తురు ఇగిరి, గడ్డకట్టి పోతుందంటే నమ్ము!'

గుర్గమణి కళ్ళు నీటితో నిండాయి. కంఠం గాద్గదిక మయిపోయింది. ఈ స్థితిని జూచి ఎవరైనా జాలి పడతారు. కానీ అతులుడు మాత్రం, జాలి పడటానికి బదులు, ఫకుక్కున నవ్వాడు.

'నీ మాటలు మహావింతగా ఉన్నా యత్తయ్యా! నువ్వే మేమిటో తలుచుకొని హైరానా పడుతున్నావు గానీ, ఇందులో దేన్ని చూసి బెంగ పెట్టుకోవాలత్తయ్యా? ఆడపిల్లలు నీకే గాదు—ఇంకా చాలా మందికున్నారు. ఆడపిల్ల ఉండటం మూలాన్నే, ఇన్ని ఇబ్బందులు, చిక్కులు, గొడవలు, ఉన్నాయని నువ్వెందుకనుకోవాలో నాకు తెలియడం లేదత్తయ్యా!' అన్నాడు అతులుడు.

'నాలో ఉన్న విచారాన్ని, చిక్కులు, గొడవలు, ఇబ్బందులు మాత్రమేనని నేనన లేను. ఆ విచారం, నన్ను ప్రతిక్షణం నమిలి మింగేస్తున్నది నాయనా! ఆడపిల్లకు పెళ్ళి చేయలేని వారు, వెలివేయ బడతారు. ఈ సంగతి నాకు తెలుసు. అయితే, జ్ఞానదను ఎలా ఒక ఇంటిదాన్ని చేయను? ఆడ ముండ పెళ్ళి, మాటలతో కాదుగదా! బోలెడంత డబ్బు ఖర్చవుతుంది! ఈ ఖర్చును ఎలా భరించడం? ఎక్కడ నుండి అంత డబ్బు తేవడం? నేడో రేపో, కూలి పోనున్న, ఈ కొంప మినహా—మరొకటేమీ నాకు కనిపించడం లేదు. ఇది తప్ప—నాదని చెప్పు కొందుకు, నాకేమీ లేదని నీకు తెలుసుగా నాయనా!'

ఇదే పెళ్ళి విషయం గురించి, భార్యాభర్తలు అరగంట క్రింపట, కీచు లాడుకున్నారు. భర్త తింటూ తింటూన్న కంచాన్ని, అవతలకు నెట్టి, కోపంతో ఆఫీసు కెళ్ళి పోయాడు. అప్పటి నుండీ దుర్గమణి మనస్సు మనస్సులో లేదు. కడుపులో విసిల్లుగా ఉన్నది. అసంఘటనతలపులు రావడంతో దుర్గమణి కళ్ళ నుండి రెండు నీటి బిందువులు రాలాయి. వాటిని గోటితో మీటుతూ దుర్గమణి అన్నది: 'పూర్వ జన్మలో నేనెన్నో మహాపాప కార్యాలు, స్త్రీ హత్యలు, బ్రాహ్మణ హత్యలు చేసి ఉన్నానేమో మరి- ఈ జన్మలో నాకిలాంటి కూతురు పుట్టింది!'

'అలాంటి పాడుపాట లనబోకత్తయ్యా!...అయితే నేను వెడతాను! లేక పోతే, నువ్వీ మాటలు మానేటట్లు లేవు.' అన్నాడు అతులుడు.

'పో బోకు. కూచో నాయనా!' అన్నది దుర్గమణి కన్నీరు తుడుచుకొని. 'ఈ సంగతులన్నీ నీకు చెప్పి, సొద వెళ్లబోసుకుంటే, నా మనస్సు తేలిక పడుతుంది...ఈ దౌర్భాగ్యపు జ్ఞానదను, నా కడుపున పడవేసేటప్పుడు—భగవంతుడు దానికి, కాస్త అందాన్ని, కాస్త శరీరచ్ఛాయనూ ఇవ్వలేక పోయాడు. ఈ నల్ల పిల్లను చేసుకొందుకు, ఎవ్వరూ ముందుకు రావడం లేదు నాయనా!...ఛి ఛీ...ఈ లోకానికి, కులగోత్రాలు, గుణగణాలు, సత్స్వభావము, అవసరం లేదు. జ్ఞానద నల్లపిల్ల గనుకనే గదా, ఇంత వరకూ పెళ్ళి పెటాకులూ లేకుండా ఉన్నది!'

'ఆయితే!' అన్నాడు అతులుడు. 'నల్లపిల్లలకు పెళ్ళి కాదా అత్తయ్యా! కందిరీగ, కోయిల గూడా నల్లగా ఉంటాయి. అంతమాత్రాన అవి అందంగా లేవని అనగలమా? వాటికి ఆదరణ లేకుండా పోయిందా? ఇవన్నీ ఇప్పటి కిప్పుడు మనం సృష్టించినవి కావు గదా! పూర్వకాలం నుండీ, ఉంటున్న దృష్టాంతరాలే నయ్యో!'

'నువ్వన్న మాట నిజమే నాయనా! ఆ దృష్టాంతరాలు, పూర్వం నుండీ ఉన్నాయి. కానీ వాటివల్ల మన కొరిగేదేమీ లేదు. వీటివల్ల మన మనస్సుకు శాంతిగానీ, హృదయానికి తృప్తిగానీ లభించదు. అంత దాకా ఎందుకూ? గిరీశ భట్టాచార్యుల కూతురు పెళ్ళి చూసినప్పుడు-నా పై ప్రాణాలు, పైనే ఎగిరి పొయ్యాయనుకో. పాపం! అతని పరిస్థితి గూడా, అచ్చం, నా దానిలానే ఉన్నది. అతనికి డబ్బు దండి లేదు, పిల్ల అందగత్తె గూడా కాదు. అందు వల్లనే, ఆ పిల్లకు అరవై ఏళ్ళ ముసలి తాత 'వరుడు'గా దొరకాడు. ఆ పిల్ల తల్లి శోకం, ఇప్పటికీ నా చెవుల్లో గింగురు మంటూనే ఉన్నది.'

'అరవై ఏళ్ళవాడా?' అన్నాడు అతులుడు ఆశ్చర్యంగా. 'నిజంగానా అత్తయ్యా?'

'నీతో నేను, అబద్ధ మాడుతానా అతులా? హరి చక్రవర్తిగారి అల్లుని సంగతి నువ్వు వినలేదను కొంటాను. అతగాడికి మాత్రం వయస్సు తక్కువా ఏమిటి? పుష్కలంగా డబ్బుండాలి. లేదా, గంటది, మాంఛి

చూపరన్నా కావాలి. లేక పోతే, ఇలాంటి ముసలి సంబంధాలు తప్ప, మంచివి రావు నాయనా!'

అతులుడు నిశ్చేష్టు డయ్యాడు.

దుర్గమణి మళ్లీ అన్నది:

'ముసలి వారిని విధిలేక పెళ్ళాడడం వల్లనే ఆడపిల్లల మనస్సులు, పెడ మార్గాలు పడుతున్నాయి. లేదా, విషం తాగడమో, ఉరిపోసు కోవడమో, నచ్చిన వారితో లేచి పోవడమో, జరగడాని కిదే కారణం! దీనికి ఎవరినని ఏం ప్రయోజనం నాయనా! నాకూ ఒక ఆడపిల్ల ఉన్నది మరి-'

అతులుడు మాట్లాడ లేదు.

'నాయనా!' అన్నది దుర్గమణి అతులుని చేయి పట్టుకొని. 'దయ, ధర్మము, వివేక వినయాలు, నీలాంటి వారి వద్ద ఉంటాయనే అందరూ అంటారు. నాకో మహోపకారం చేసి పెట్టు నాయనా! నీ మేలు జన్మ జన్మాలకు మరిచి పోను!'

'ఏమి టత్తయ్యా అది?' అన్నాడు అతులుడు.

'నీకు చాలా మంది స్కూలు కుర్రాళ్ళు, కాలేజీ కుర్రాళ్ళు తెలిసే ఉంటారు. వారిలో ఎవరన్నా-జ్ఞానదను చేసుకొంటారేమో ప్రయత్నించు.'

అతులుడు ప్రయత్న పూర్వకంగా, దుర్గమణి చేతిలోని చెయ్యి విడిపించుకొని అన్నాడు:

'ఊరికే—ఎందుకిలా గాభరాపడతా వత్తయ్యా! నేను ప్రతిజ్ఞ...'

వాక్యం తుంచినట్టు ఆగి పోయింది. ఆ పై మాట పెకిలి రానేలేదు- తను చేయనున్న ప్రతిజ్ఞ ఏమిటో అతనికే స్పష్టంగా తెలియదు. దుర్గమణి. ప్రాధేయ పూర్వకంగా అలా అనడంతో, అతులుడు ఆవేశ పూరితుడై నాడు. ముఖం ఎర్రబడ్డది. కంఠం గాద్గదిక మైంది. తనను తాను సంబాళించుకొని, పోవడానికి లేచాడు.

'అలాగే అత్తయ్యా!' అన్నాడు అతులుడు. 'తప్పకుండా ప్రయత్నించి చూస్తాను...జ్ఞానదా! ఓ జ్ఞానదా!! ఎక్కడున్నావ్ నువ్వు? తమల పాకులు తెచ్చిపెట్టు. నేనింటి కెళ్ళాలి.'

'ఏమేవ్ జ్ఞానదా! వినపించ లేదుటే! నీ అతులుడికి తాంబూల మిచ్చి పంపు.' అని కేకేసి, అతులునితో అన్నది. 'ఈ పాడు పిల్లకు అందమే గాదు నాయనా, జ్ఞానం గూడా లేదు. చూస్తున్నావుగా, ప్రసాదం తీసుకొని, ఇందాకనంగా, లోపలి కెళ్ళింది; ఇంత వరకూ బైటికే రాలేదు. ...ఏమే! తొందరగా ఆకులు పట్టుకురా! అతులుడు వెళ్ల బోతున్నాడు.'

'సరే! అయితే నేనే వెళ్ళి తెచ్చుకొంటా నత్తయ్యా!' అన్నాడు అతులుడు బయలు దేరుతూ. 'జ్ఞానదా! నువ్వే గదిలో ఉన్నదీ కాస్త చెప్పు.' అంటూనే అతులుడు పడక గదిలోకి వెళ్ళాడు.

ఆకు వక్కలు దగ్గరగా పెట్టుకొని అక్కడ కూచోనున్నది జ్ఞానద.

'ఈ పాడు పిల్లకు తెలివి తేటలూ లేవు. అందమూ లేదు. అరవ య్యేళ్ల ముసలి మొగుణ్ణి అంట గడితే గానీ...' అంటూ లోపలికొచ్చాడు అతులుడు.

జ్ఞానద మాట్లాడ లేదు. ఆకులు, వక్కలు, ఉన్న పళ్ళెన్ని అతులుని చేతి కిచ్చింది.

అతులుడు వెనకగా వచ్చి, ఆకులు అందుకొంటూ అన్నాడు: 'ఈ ఆకులు బాగా ఉన్నాయంటే-నిన్ను అరవయ్యేళ్ళ ముసలాడి కివ్వను జ్ఞానదా! ఇరవైయ్యేళ్ళ పడుచు వాడికిచ్చి, ముడిపెట్టేస్తాను.'

లజ్జాభారంతో జ్ఞానద ముఖం వాలి పోయింది.'

'జ్ఞానదా!' అన్నాడు అతులుడు. 'ఈ రోజల్లా నేను అత్తయ్యతో మాట్లాడుతూ గడిపి వేశాను. మధ్యాహ్నం గూడా అయింది.

ఈ మాటకు గూడా జ్ఞానద మౌనంగానే ఉన్నది.

'నాతో మాట్లాడవన్న మాట! సరే — ఆ బెట్టేమిటో నేనూ చూస్తాను!' అన్నాడు అతులుడు, ఆమె జెడను సగం మేరకు చేతికి చుట్టుకొని లాగుతూ. 'నాతో మాట్లాడవు గదూ! సరే—అలానే బిగబట్టుకొని ఉండు...ఆ హరి చక్రవర్తిలాంటి వస్తుగాడు, మొగుడుగా దొరికితేగానీ... నేను పోతున్నాను.'

నవ్వుతో గదిలోంచి బైటి కొచ్చాడు. గుమ్మంలో కాలు పెడుతూనే బిగ్గరగా అన్నాడు:

'అత్తయ్యా! బొంబాయి నుండి, జ్ఞానద కోసమని, అమ్మ రెండు గాజులు కొనుక్కు వచ్చింది. ఇలా వచ్చి ఒకసారి చూసి పో'

దుర్గమణి వచ్చింది. వాటి రంగు, పనితనమూ చూసి, ఆమె చాలా సంతోషించింది.అతులునితల్లినిగూడాఅభినందించింది. కొనడానికాగాజులు లోపాపువి. కానీ ఆ పని తనం చూస్తుంటే—ఖరీదు పెట్టినా, అవి పట్నా లలోనే గానీ, ఇక్కడ దొరకవని దుర్గమణి అనుకొన్నది.

తల్లి అప్పటికే చాలా సార్లు పిలిచింది. ఇంకా రాకుండా ఉంటే-బావుండదనేమో, జ్ఞానద బైటి కొచ్చింది. నిశ్శబ్దంగా తల వంచుకొని నిల బడింది. ప్రప్రథమపు సస్నేహ బహూకృతి నందుకొనడానికై చేతులు చాపి నప్పుడు, జ్ఞానద శరీరం పులకాంకిత మయింది. ఆమె హస్తాలు ప్రకంపిం చాయి. అలానే అతులుని పాద ద్వయానికి ప్రణమిల్లి, మౌనంగా అక్కడ నుండి వెళ్లి పోయింది.

౩

ముగ్గు రన్నదమ్ముల సమిష్టి కుటుంబంలో నించి, జ్యేష్ఠుడైన గోలోక నాధ్ ఇహ లోకాన్ని చాలించాడు. భర్త చనిపోవడంతోనే స్వర్ణ మంజరి, తన చిన్న మరిది అనాధనాధుని వద్ద కొచ్చి రోజులు వెళ్ళ మారు స్తున్నది. స్వర్ణ మంజరికి తోబుట్టువు లెవ్వరూ లేరు. ఆ కారణంతో తండ్రి గారి ఆస్తి యావత్తూ ఆమెకే సంక్రమించింది. స్వర్ణ మంజరి చరచిరాస్థు లన్నింటినీ అమ్ముకొని, మరిది దగ్గర విశ్రాంతి ననుభవిస్తూ ఉంది.

ప్రియ నాథుడు, అనాధనాధుడు ఒకసారి తీవ్రంగా పోట్లాడు కొన్నారు. ఇంక 'సంధి' అంటూ జరిగేందుకు అవకాశం లేక పోయింది. ఆస్తిపాస్తుల పంపిణీ దాకా వచ్చింది వ్యవహారం. ఉన్న ఆ కాస్త కొం పనూ ఇద్దరూ చెరి సగం పంచేసుకొన్నారు. పంపకాలు పూర్తిఅయ్యాయి. తనకూ, తమ్మునకూ మధ్యగా గోడకట్టాలను కొన్నాడు ప్రియనాథుడు. అనుకోవడం సులభం గనుక అనుకొన్నాడు గానీ, కట్టించడం మాటలా మరి! శక్తిలేక పోయింది. ఆ ప్రయత్నం నుండి విరమించాడు. ఇది జరిగిన కొద్దిరోజులకే అతను జ్వరపడ్డాడు. మందు మాకులులేక, తీసుకొని తీసుకొని ఘోరమైన చావు చచ్చాడు. ప్రియనాథుడు.

రేపు ప్రియనాథుడు చని పోతాడనగా, ఈ నాడు గ్రామస్థులంతా అతని మంచం చుట్టూ ముసురుకొన్నారు. వారిని చూచి ప్రియనాథుడు బెంబేలు పడలేదు. ఆ సమయాన అతులుడు కలకత్తాలో చదువుతున్నాడు. పిడుగు పాటు లాంటి ఈ వార్త అతని కందింది. రెక్కలు గట్టుకొని వాలాడు. ఇసుక వేస్తే రాలనట్టుగా జనం మూగారు. వాళ్ళను తొలగ దోసుకొని లోపలికి పోదామని అతులుడు ప్రయత్నిస్తున్నాడు. ఇంతలో జ్ఞానద పిచ్చి దానిలా పరుగెత్తుకుంటూ వచ్చి, అతులుని పాదాలకేసి తల బాదుకో సాగింది.

చుట్టూ గుమి గూడిన ప్రజకు ఈ దృశ్యం ఆశ్చర్యాన్ని కలిగించింది. తమలో తాము తర్క వితర్కాలు చేసుకొన్నారు. మల్ల గుల్లాలు పడ్డారు. చుట్టూ ఇందరుండగా, జ్ఞానద ఈ పని చేసినందుకు, అతులుడు గూడా సిగ్గుపడ్డాడు. అతను తేరుకొని, జ్ఞానదను లేవదీయ బోయాడు గానీ, జ్ఞానద లేవ లేదు. త్రాచు పాములా అతని కాళ్ళను పెనవేసు కొన్నది. గుండెలు పగిలి పోయేలా ఏడుస్తున్నది.

'మా నాన్నగారు చచ్చి పోబోతున్నారు అతుల్!' అన్నదామె వెక్కెక్కి పడుతూ. 'ఆత్రుతతో తల్లడిల్లి పోతున్న ఆయన మనస్సును, కాస్త శాంతింప చేయి అతుల్! నా మూలకంగా వారికి సంక్రమించిన, వేదనలను, ఇక్కడే వదిలి, సుఖంగా, నిర్విచారంగా, వారిని దాటి పోయే టట్టు చూడండి! ఈ దురదృష్ట వంతురాలు—భవిష్యత్తులో గూడా మిమ్మే సహాయమూ కోరదు. నా ముఖాన భగవంతుడెలా రాసి ఉంటే, అలా జరుగుతుంది. అతుల్! ఈ ఒక్కసారి నువ్వు సాయపడు!'

జ్ఞానద వ్యాకుల పాటుతో కలవర పడుతున్నది. అసంఖ్యాకమైన, విచారాలు, వేదనలు, రోదనలు, బాధలు, దిగుళ్ళు, తనలోనే సమయింప జేసుకొని ప్రియనాథుడు మృత్యు ముఖంలోకి పోనున్నాడు. ఈ విచారం వల్లనే, సమయా సమయాలను, ఉచితా నుచితాలను, మంచి చెడ్డలను, జ్ఞానద విచారించలేక పోయింది.

వస్తుతః అతులుడు శాంత స్వభావుడు. జ్ఞానద చేసిన ఈ 'అనుచిత కార్యం' అతనికి జాలి కలిగించింది. కానీ అది బైటపడకుండా జాగ్రత్త పడ్డాడు. కారణం చుట్టూ ముసిరిన ముది సమాజం! దానికి మంచి చెడులూ

తెలియవు. సమయా సమయాలూ తెలియవు. అందుకే అతులుడు తన కారుణ్య హృదయాన్ని పొంగనీకుండా, చిచ్చి కొట్టాడు. పైగా నలుగురి ఎదుటా, ఈ కార్యాన్ని సహించలేని వాడుగా ప్రవర్తించాలని కూడా అతనికి తెలుసు గనుక, ఆమెను బలవంతంగా లేవనెత్తాడు.

'జ్ఞానదా! ఎందుకిలా ఏడుస్తావు? ఏడ్చి నువ్వు సాధించేదేమీ లేదు. నువ్వూరుకో. నేను చెప్పవలసిందేమిటో మీనాన్నగారికి చెబుతాను.'

ఈ మాటలని అతులుడు రోగి మంచం దగ్గర కొచ్చి కూలబడ్డాడు. కాళ్ళ వేపు కూచున్న దుర్గ అతులుణ్ణి చూచి బావురుమని ఏడ్చింది. గుమ్మం దగ్గిర నిలబడిన నీలకంఠ ఛటర్జీ, అతులుణ్ని ఉద్దేశించి ఇలా అన్నాడు:

'తమ్ముడూ! ప్రియనాథు డింకా తెలివి తప్పి పోలేదు. నువ్వు చెప్ప దలుచుకొన్నదేదో గట్టిగా చెప్పు. లేక పోతే అతనికి వినిపించదు.'

వృద్ధుడైన నీలకంఠ ఛటర్జీ చేసిన ఈ సూచనను, మరి కొందరు కూడా బలపరచారు. ఈ గుంపును చూసే సరికి అతులునికెక్కడా లేని కోపం వచ్చింది. 'మీరందరూ ఎందుకిలా గుంపులు గట్టారో నాకు బోధపడడం లేదు. రోగికి, రవంతగాలీ, వెలుతురూ కావాలి. మహాశయు లారా! దయచేసి మీరంతా దూరంగా వెళ్లి పొండి. నేను చెప్పవలసిం దేమిటో అప్పుడు చెబుతాను.' అని బిగ్గరగా అరిచాడు అతులుడు.

'ఉద్రేకపుడియంగా మేమెందుకు నిలబడతాం అతుల్?' అన్నాడు నీలకంఠ ఛటర్జీ కోపంతో మండిపోతూ. 'ఇరుగు పొరుగుల కష్టసుఖాలకు ఇరుగు పొరుగు వారే వస్తారు...అది సరే గానీ నాయనా! ఇన్నిటికీ-నువ్వా మంచంమీద కూచుని-చేయబోతున్న ఆ మహోపకార మేమిటో సెల విస్తారా?'

అతులుడు లేచి నిలబడ్డాడు.

'నేను ఉపకారమే చేస్తానో, అపకారమే చేస్తానో మీకెందుకు? ఈ విధంగా గుంపులు పడి, రోగికి ఇంకా యాతన కలిగించడం తప్ప మీరు చేస్తున్నదేమీ లేదు గదా! దయచేసి మీరందరూ—అందరూ బైటికి వెళ్ళి పొండి!' అన్నాడు.

అతులుని ముఖ కవళికలు చూసి నీలకంఠ ఛటర్జీ ఏమనుకొన్నాడో ఏమోగానీ, చప్పున రెండడుగులు వెనక్కి వేశాడు.

'నా కళ్లెదట పుట్టిన కుర్ర కుంకవు ..నువ్వే ఇలా మితిమీరిమాట్లాడ తావటోయ్! సరే చూస్తాను...' అని గొణుక్కున్నాడు ఘటర్జీ.

'యఫ్. ఏ; బి. ఏ; ప్యాసయినాడు కదూ! అందుకూ ఆ గీర!' అన్నా డింకొక మనిషి.

ఈ గలభానంతా చూస్తున్న పది సంవత్సరాల కుర్రవాణ్ని, అతు లుడు నెట్టాడు. ఆ తోపును వాడు నిలవదొక్కుకోలేక, ప్రక్కవాడి మీదికి విరుచుకు పడ్డాడు. చిన్న కలవరం బయలు దేరింది. దీనినంతా చూస్తున్న నీలకంఠ ఘటర్జీ వర్గ రాలు-పెద్దలు, మర్యాదస్తులూ గనుక— గుట్టు చప్పుడు గాకుండా బైటికెళ్లి పొయ్యారు.

అందరు వెళ్ళి పోయాక, అతులుడు ప్రియనాథుని ముఖం దగ్గర ముఖం పెట్టి, 'మామయ్యా!' అన్నాడు. రక్తంతో గీరలు కట్టిన కళ్ళను బాధగా విప్పి, అతలుణ్ని చూశాడు ప్రియనాథుడు.

'నీ వంట్లో ఎలా ఉంది మామయ్యా?'

'ఏమని చెప్పను నాయనా?' అన్నాడు రోగి తల అడ్డంగా తిప్పుతూ. 'ఏమీ బాగుండ లేదు.'

అతులుని కళ్ళల్లో నీరు తిరిగింది. కన్నీరాపుకొంటూ, గొంతు సరి చేసుకొని, అతులుడిలా అన్నాడు: 'మామయ్యా! మీరు నిశ్చింతగా ఉం డండి. ఇక నుండి జ్ఞానద బరువు భారాలు నేను భరిస్తాను.'

అతులుని మాటలు, రోగికి బొత్తిగా అర్థం కాలేదు. అటూ ఇటూ పరికించి చూసి, 'నాయనా! పిల్ల దెక్కడున్నదోయ్!' అన్నాడు?.

ఇదంతా చూస్తున్న దుర్గమణి, విచారాన్ని ఆచుకోలేక పోయింది. భర్త ముఖం మీదికి వాలి, భోరుమని ఏడ్చింది. అతులుడు, దుర్గమణిని సముదాయించాడు. ఆమె ఏడుపును దిగమ్రింగి—

'అమ్మాయి నొకసారి చూస్తారా?' అన్నది.

ప్రియనాథుడు కొన్ని క్షణాలపాటు ఏమీ మాట్లాడ లేదు. చివరకే మను కొన్నాడో ఏమో గానీ, భార్యతో స్పష్టంగా చెప్పేశాడు 'చూడను. అని.

ఈ సారి దుర్గమణి దుఃఖానికి పరిమితి లేక పోయింది. అలా ఏడు స్తూనే అన్నది:

'అతులు డంటున్న దేమిటో మీరు విన్నారా? అమ్మాయి బరువు భారాలన్నీ, తనే మోస్తానంటున్నాడు. జ్ఞానదను గురించి మీరు దిగులు పడకండి ..ఆ దురదృష్టవంతురాలు మీ ఎదుటికి వచ్చి, చాలా రోజులైంది. పిలిపిస్తాను. ఇప్పుడైనా దానిని మీ రాశీర్వదించండి.'

దీనికీ ప్రియనాథుడు మాట్లాడ లేదు. అలా ఊరికే చూస్తూ ఉండి పోయాడు.

ఆ మాటనే మళ్ళీ అన్నది దుర్గమణి. అతనేమను కొన్నాడో ఏమో మరి, కళ్ళ వెంట, నీరు ఉరల సాగింది. కుషి్క్రంచి పోయిన, తన హస్తాలతో అతులుని తల నిమిరి, ఒక ప్రక్కగా వత్తి గిల్లి పడుకొన్నాడు. అంతకు మినహా అతని నుండి-మరే విధమైన ప్రత్యుత్తరమూ లేదు. ప్రియనాథుడు మృత్యువుకు అతి సమీపంలో ఉన్నాడని అతులుడు గ్రహించాడు. ఇంత వరకూ నిగ్రహంతో కూచున్న అతులుడుగూడా విచారాన్ని దిగ మ్రింగ లేక ఒక్కసారి బావురు మన్నాడు. అలా ఏడుస్తున్నట్టు సాక్ష్యం చెప్పగల వారు ఇద్దరు మాత్రమే ఉన్నారు. మొదటి వారు దుర్గమణి. కాగా ఆ రెండవ సాక్ష్యం భగవంతునిది.

ఆ చావు బ్రతుకుల వెలుగు నీడలలో ప్రియనాథుడు రెండు రోజులు కొట్టు మిట్టాడాడు. ముప్పది రూపాయల నౌకరీ మీది మమకారమును, ఇరవైయారేళ్ళ భార్యను, పెళ్ళి కావలసిన పదమూడేళ్ళ కూతురును, వదిలి పెట్టి, తులసి కోట వద్ద ప్రాణాలను కోల్పోయాడు ప్రియనాథుడు. అప్పటి కతని వయస్సు ముప్ఫయ్యారు సంవత్సరాలు. అయినా ముది వగ్గులా తయారయినాడు. ఆ కృత్రిమపు వృద్ధాప్యంతోను, వ్యాధితోను, యథాశక్తి పోరాడి, 'గంగ-నారాయణ-బ్రహ్మ' నామాలను, అంతిమ క్షణాల్లో సయితం జపిస్తూ, హిందూ పుణ్య లోకాలికే పోయాడు ప్రియనాథుడు.

## 3

ప్రియనాథుని శ్రాద్ధకర్మాదులు పూర్తయిన పది పదిహేను రోజులకు, కడగొట్టువాడైన అనాథనాథుడు సమిష్టి స్థలంలో, అడ్డుగా ఓ గోడ కట్టి, ద్వారాబంధా లేర్పరిచాడు.

అనాధనాధుడు—ఒకనాడు ఆఫీసుకు వెళ్ళబోతూ, దుర్గమణి సుమ్మ్రంలో కొచ్చి ఇలా అన్నాడు:

'వదినా! ప్రతి విషయమూ నీకు విడమరచి చెప్పనవసరం లేదు. అన్ని విషయాలూ నీకు తెలుసు. అన్నగారు జీవించి ఉన్న రోజుల్లో, అనవసరంగా నాతో ఎన్నోసార్లు పోట్లాడారు. చీటికీమాటికీ తగాదాలు పెట్టుకొన్నారు. నిష్కారణంగా నాతో పలకడం మానేశారు. అయినా—ఇప్పుడవన్నీ నేను మనస్సులో పెట్టుకోదలచ లేను. నీ కింత అన్నం పెట్ట డానికి నాకేమీ అభ్యంతరం లేదనుకో. కానీ...జ్ఞానదకు పెళ్ళి గిల్లీ చేయడం మాత్రం నావల్ల కాదు...నలుగురూ ఏమిటో అనుకొంటారు గానీ వదినా; నా సంసారం మాత్రం చిన్నదా మరి! పేరుకు నూటయాభై రూపాయల జీతగాణ్నేగానీ, లెక్కచూసుకొంటే మిగిలి చచ్చేదేమీ ఉండదు. వాళ్ళకివాళ్ళు, సున్నకు సున్న సరిపోతుంది. అదీగాక-పెళ్ళెడుకొచ్చిన ఆడకూతురు, నాకు ఉన్నది గదా! కాబట్టి నువ్వో పని చెయ్యి. వారిపాలెంలో మీ అన్నగారున్నారు. పిల్లదానితో సహా నువ్వక్కడికెళ్ళి, కొన్నాళ్ళపాటు తల దాచుకో...తరువాత సంగతి చూసుకోవచ్చు.'

వంటింటిలో నుండి మరిది మాటలు వింటున్న దుర్గమణి సరిగ్గా నిలుచోను కూడా నిలుచోలేక పోయింది. ఎలాగో నిలదొక్కుకొని, పూడిపోయిన గొంతును సవరించుకొని అన్నది:

'అనాధ్! నాఅన్నగారి విషయాలు నీకు తెలిసినవేగానీ, కొత్తవికావు. ఆయన దగ్గర చిల్లగవ్వ కూడా లేదు. పిల్లదాని తండ్రి చావు బ్రతుకుల్లో ఉన్నాడని తెలిసీకూడా ఆయన రాలేదంటే---ఇంకేమని చెప్పడం! ఎవరన్నావచ్చి తీసికెడితే తప్ప, లేకపోతే నేనాగడపతొక్కనే తొక్కను!'

ఈ మాటలన్నీ గోడ ప్రక్కనే ఉండి వింటున్న స్వర్ణమంజరి, మధ్యలో కలుగ చేసుకొన్నది.

'నువ్వన్నమాట నిజమే చెల్లీ! అన్నగారి స్థితి అంత బాగా లేదని నాకూ తెలుసు. అయినా—నీ మరదిగారు మట్టుకు ఏమంత కలవాడని? పేరుకు నూటయాభై రూపాయల జీతమన్న మాటేగానీ, అవి ఎందునా చాలవు. ఆ జీతం రాళ్లను, ఎంత పొదుపుగా, జాగ్రత్తగా వాడుకు

న్నానో నాకు తెలుసు; ఆ భగవంతునికి తెలుసు...అదీగాక—జ్ఞానద పెళ్ళీడు కొచ్చిన పిల్ల. ఈ బరువును—ఎవరైనా అవుగాక—భరించటం మాటలా చెల్లీ?—ఇలాంటి ఆపత్సమయాలలో, ఏదో విధంగా తలవంచు కొని రోజులు గడుపుకోవాలిగానీ, మానాభిమానాలనీ, గౌరవమనీ, గుంజనీ, గుదిగొయ్యనీ కూచుంటే పనులు జరగవు.'

'నిజమే అక్కయ్యా!' అన్నది దుర్గమణి. 'ఏదో మాట వరసగా అన్నానుగానీ, నాకింకా, గౌరవము, అభిమానము, ఎక్కడ మిగిలాయమ్మా! వారితోబాటే అవి గూడా నన్ను దాటిపోయాయి.' అన్నది మెత్తగా, అంట బొడుస్తున్నట్లు.

స్వర్ణమంజరికి చిరుక్కు మన్నది. అనాధనాథుణ్ణి, ప్రక్కకులాగి, తనే ముందు కొచ్చి అన్నది: 'నువ్విలా, మురబ్బీగా, నీళ్లు నములుతూ మాట్లాడ్డానికి, నిన్ను నేనేమీ కాని మాట అనలేదు చెల్లీ! నేను ప్రమాణ పూర్తిగా చెబుతున్నాను...నేను మంచిదాన్ననుకొన్నా సరే, దుర్మార్గు రాలి ననుకొన్నా సరే! జ్ఞానదలాంటి కోతిముండకు పెళ్లి చేయడం మావల్ల కాదని స్పష్టంగా చెబుతున్నాను...చిన్న మరిదిగ్గూడా, పెళ్లి కావలసిన పిల్లముండొకతున్నది. సంబంధాల కొచ్చేవాళ్ళు, మరిదికూతుర్నుచూసిన తరువాత జ్ఞానదను చూడటమంటూ జరిగితే, ఈ జన్మలో దానికి పెళ్ళి కాదు...నేనిలా అంటున్నానని—మరోలా భావించ బోకు చెల్లీ! మారి పాలెం ఎందుకు వెళ్ళమంటున్నామని! నువ్వు కాస్త నిదానంగా ఆలో చించిచూడు. ఇక్కడైతే జ్ఞానదకు పెళ్లి గావడం కష్టంగానీ మారిపాలెంలో ఈ బెడద ఉండదు. ఎందుకంటే మారిపాలెంలోని కన్యలు, యువతులు, కాస్త కుడి ఎడముగా, జ్ఞానదలానే ఉంటారు గనక. అక్కడే—ఏదో ఓ సంబంధం చూసి, దానికి ముడిబెట్టెయ్యి. నీ తలమీది బరువు తీరి పోతుంది...మారి పాలెం జనానికి అందచందాలు, రూపురేఖలు అవసరం లేదు. ఆడపిల్ల కనిపిస్తే చాలు---జన్మతరించినట్లు భావిస్తారు.' అన్నది స్వర్ణమంజరి.

దుర్గమణి మౌనంగా ఊరుకొన్నది. ఏ పెళ్ళి నిమిత్తమై ఆ అన్న దమ్ములు వేరు పడిపోయారో, ఈ నాడు ఆ పెళ్ళి ప్రస్తావనే తిరుగా వచ్చింది...

దుర్గమణి మౌనంగా ఉండి పోవడం చూసి, స్వర్ణ మంజరి ఇలా అన్నది:

'చెల్లీ! ఏది ఎట్లా జరగాలని భగవంతుడు ఆశించాడో అది అట్లాగే జరుగుతుంది. ఎక్కడ దాకానో ఎందుకు? నిన్ను ఎవ్వరూ ఏమాటా అనరా? నన్నందరూ ఆడిపోసుకొంటూనే ఉంటారు. చూపరి, చదవరి, అయిన అల్లుణ్ణి తీసుకు రాకపోతే, నలుగురి నోళ్ళల్లోనూ నానాలి. కాస్తో కూస్తో డబ్బుండి, ఇంత ఆర్జన ఉండి గూడా, కాస్తంత మంచి అల్లుణ్ణి గనక తీసుకు రాకపోతే, నా పాట్లు చెప్పనా చెల్లీ! రవ్వలాంటి పిల్లను రాళ్ళ కొప్ప చెప్పానన్న వాదు మొయ్యాలి సొస్తుంది...అవునా కాదా అనాధ్?'

స్వర్ణమంజరి ఓ వక్ర దృక్కుడు అతని వేపుకు విసిరింది.

'ఆహా! అక్షరాలా నిజమే!'

ఈ మాట అని, వదినగారి మర్యాదను నిలబెట్టా ననుకొంటూ, అతగాడు ఆఫీసు కెళ్ళిపోయాడు.

'మీ అన్ననే నువ్వు మంచి చేసుకో చెల్లీ! ఇలాంటి ఆపదల్లో ఉన్న పుడు ఆవేశ కావేషాలు పనికిరావు. అతనే ఓ మగ పురుగును చూసి, నీ బాధ వదలించ గలడు. ఇందుకు నువ్వు మాత్రం సిగ్గుపడాల్సిం దేమున్న దమ్మా! నిన్నెవ్వరూ 'ఇదేమిటీ?' అని వేలెత్తి అడగరు. ముప్ఫయ్యేడూపా యల జీతంలో, ఓ మూలనపడి బ్రదికిన మరిది విషయం, లోకానికి తెలి యదు. ఏ కాస్తన్నా తెలిసిఉంటే, వీళ్ళకు సోదరుడు కావడం వల్లనే గానీ, మరో ఘనతను చూసి కాదు గదా! రేపు—అన్నిటికీ దివ్యమైన రోజు. జాగుచేయక—రేపే వెళ్ళు. సరేనా?'

అతులుని విషయం స్వర్ణమంజరికి చెబుదా మనుకొన్నది దుర్గమణి. కానీ ఆ మాట నామె అనలేక పోయింది. అదీగాక—అతులుడు తమకు సరాసరి బంధువు కాడు. బంధుత్వ మనేది ఉంటే, అది పెద్దక్కగారి ద్వారానే సంక్రమించింది.

దుర్గమణి ఏ సమాధానమూ చెప్పకుండా, ఇంట్లోకి వెళ్ళేటప్పటికే, జ్ఞానద కటిక నేలమీద పడుకొని ఉన్నది. దుర్గమణి మెల్లిగా కూతురు

ప్రక్కనే నిలబడి తల నిమురుతూ అన్నది: 'మీ పెద్దమ్మ అంటున్న మాటలు నువ్వు విన్నావా తల్లీ?' అని.

అంగీకార సూచకంగా జ్ఞానద తల నాడించింది. ఆ తరువాత ఏమి చెప్పాలో దుర్గమణికి తోచలేదు.

తల్లి నిర్వాక్కుగా ఉండటం చూసి జ్ఞానద, 'అమ్మా! అమ్మమ్మ గారింటికి, నేనింతవరకూ వెళ్ళలేదు. ఓసారి వెళ్ళి చూడి వద్దామని ఉన్నది. పోదాం పదమ్మా!' అన్నది.

దుర్గమణి మనస్సు క్షోభించింది.

'మీ అమ్మమ్మ చనిపోయి చాలా కాలమైంది జ్ఞానదా! మేనమామ, గారే ఉన్నారు. అత నైనా ఉండి గూడా లేనట్లే లెఖ్క. మనం ఇన్ని కష్టాలు, యాతనలు పడ్డాము గదా—ఒకసారన్నా అజాపజా కను క్కొన్న పాపాన పోలేదు. మనిషి రాకపోతే మానె, కనీసం ఉత్తరం గూడా రాయలేదా మానవుడు. అటువంటి వాడి పంచకు ఇప్పు డెలా వెడతాం తల్లీ?'

'బాధితుల, దుఃఖితుల విషయాలు, ఎవ్వరూ పట్టించుకోరు. వారిని గురించి ఎవ్వరూ కలుగచేసుకోరు గూడాను...' అన్నది జ్ఞానద బాధ పడుతూ. 'ఇక్కడ మీరేమో, నిలవనీకుండా వెళ్ళమంటున్నారు. ఎలా ఉండడం? మర్యాదలు, గౌరవాలు, ఇప్పు డాలోచించడం అవివేకం. నాన్నగారితోబాటే అవిగూడా కాలగర్భంలో కలిసి పోయాయి. పోయిన వాటిని గురించి విచారిస్తే ఏం లాభమమ్మా?'

దుర్గమణి కంట తడిపెట్టుకొన్నది.

జ్ఞానద కన్నీటిని అద్దుతూ అన్నది:

'పాపిష్టి దాన్ని! నేను పుట్టక పోయినా బాగుండును. నామూలం గానే, నువ్వెక్కడికీ వెళ్ళలేక పోతున్నావు. నేనొక గుదిబండలాగా నీ మెళ్లో వేళ్ళాడుతున్నాను. ఆ సంగతి నాకు తెలియనిది కాదు. కాని పక్షంలో—పెద్దమ్మ అనరాని మాటలన్నా, నువ్వు సహించి ఇక్కడే ఉండాలనుకోవడం ఎంతవరకు జరుగుతుంది? నన్ను గురించి నువ్వేమీ దిగులు

పడకమ్మా!—పద. ఎక్కడైనా సరే-వెళ్ళి కొంతకాలం గడిపి వద్దాం పద. ఇక్కడే ఉంటే—నువ్వు కూడా నాకు దక్కవు.'

దుర్గమణి ఈ మాటలకు తట్టుకోలేక, కూతురును దగ్గిరగా పొదువు కొని, వెక్కి-వెక్కి ఏడ్చింది. జ్ఞానద తల్లిని సముదాయించ లేదు. తల్లి గుండెల్లో ముఖం దాచుకొని అలానే ఉండిపోయింది.

దుర్గమణి కన్నీరు తుడుచుకొని, కూతురును మరింత దగ్గరగా హత్తు కొన్నది.

'జ్ఞానదా! నువ్వు గూడా లేకపోతే, నాకీలోకంలో ఏమున్న దమ్మా? మీనాన్న గారితోబాటు నేను గూడా దాటిపోయే దాన్ని. నువ్వున్నావనే,నిన్ను చూసుకొనే, నేనింకా అందుకు సాహసించ లేదు.'

'ఆ సంగతి నాకు తెలుసమ్మా!'

'సరేగానీ జ్ఞానదా! మీనాన్నగారు చనిపోబోయే సమయాన, అతులు ఆమాటలెందు కన్నాడో నాకు తెలియ లేదు. నువ్వన్నా నిజ మేమిటో చెప్పు తల్లీ!...అయ్యో! పిచ్చితల్లీ! ఎందుకే అలా సిగ్గుపడి పోతావ్! ఇది సిగ్గు పడవలసిన సమయమా తల్లీ! అతులుడు అసత్యవాదని, నేననుకోను. మరణావస్థలో ఉన్న మీ నాన్నగారితో,నీ బరువు భారాలు తనే వహిస్తానని ఎందుకన్నాడు? నువ్వెందు కతని కాళ్లకు చుట్టేసు కొన్నావు?'

'ఏమో! ఎందు కలా చేశానో, ఇప్పుడు నేను చెప్పలేను.'

ఆ మాట అంటున్నప్పుడు, కూతురు ముఖం చూడాలని దుర్గమణి ప్రయత్నించింది. కానీ జ్ఞానద ఆ ప్రయత్నాన్ని వమ్ము చేసింది. తల్లి వక్షంలో తలదాచుకొని, ఇటుకేసి తిరగనన్నా తిరగలేదు.

'మీనాన్నగారుండగా, నాకే బాధలూ, దిగుళ్లూ లేవు తల్లీ! మన కర్మానికి మనల్నొదిలి వారు వెళ్ళడంతోనే, అన్నీ కష్టాలే దాపు రించాయి. ఏం చేస్తాం తల్లీ! అతులు అన్నమాటలు, స్వయంగా నేను విన్నాను. అయినా ఆ మాటలు నేను విశ్వసించలేక పోతున్నాను'. అన్నది దుర్గమణి కూతురు చేతుల్ని, తన చేతుల్లోకి తీసుకొంటూ. 'నాతో నిజం చెప్పమ్మా! నేను—ఏవేవో అనుకొంటున్నాను. నా ఆలోచనలు వటిపోవు గదా! ఇవన్నీ నేను కలలో చూడడం లేదు గదా జ్ఞానదా!'

ఈ సారి కూడా జ్ఞానద మౌనంగానే ఉన్నది.

ఆనందభారంతో దుర్గమణి కళ్ళంట నీరు కారాయి. 'త్వరగా—అసలు సంగతేమిటో చెప్పు జ్ఞానదా! నన్నింకా అనుమానాలతో కట్టి పడేయకు...నిజం చెప్పు. చచ్చి స్వర్గాన ఉన్న మీ తండ్రిగారి కీవిష యాలన్నీ చెబుతాను. నా ఆక్రందనను మీనాన్నగారు తప్పకుండా వింటారు! అసలు సంగతేమిటమ్మా?'

'అమ్మా!' అన్నది జ్ఞానద. 'నాన్నగారితో నా పెళ్ళిని గురించి నువ్వేమి చెప్పదలుచుకొంటే, అదే చెప్పు. నేను కాదనను. నాన్నగారి ఆత్మకు అలజడి లేనివిధంగా, అతులు డామాట అన్నాడు. అలా అన మనే, అతుల్ణి నేను ప్రార్థించాను. నా ప్రార్థనను అతులుడు విన్నాడు. నేను కోరినట్టుగా చేశాడు. చాలు—ఆ తరువాత సంగతేమిటని నన్నడ గకు. అతులుని దయాధర్మాలపై అవి ఆధారపడి ఉంటాయి—'

దుర్గమణి తనను తాను నిగ్రహించుకోలేక పోయింది. క్రీడా భారంతో అరుణిమనుదాల్చి, అశ్రుత ప్తమైన జ్ఞానద వదనాన్ని తనివితీరా చూడాలన్న కాంక్షతో, ముఖాన్ని తన వేపుకు తిప్పుకుని ముద్దాడింది. గాఢంగా వక్షస్థలానికి హత్తుకొన్నది.

'తల్లీ! నువ్వంటున్నది సత్యమే గదూ? అతులుడు చిరంజీవి కావాలి!' అన్నది దుర్గమణి ఆవేశంతో. 'సావిత్రి చరిత్ర నీకు తెలును గదా జ్ఞానదా! భర్తప్రాణాలను యమధర్మరాజు, హరించి పోతుంటే, వెంటబడి, ప్రార్థించి, వేడుకొని, తన సచ్ఛీలంచేత, భక్తిచేత, ధవుని ప్రాణాలు తిరిగి పుచ్చుకొన్నది. నిన్ను చూస్తుంటే నాకా సావిత్రి జ్ఞప్తి కొస్తున్నది. అతులుడు అంటురోగానికి గురయినప్పుడు—నువ్వతని దాపులోనే, రాత్రింబవళ్ళు, పడి గాపులు కాచి, నీ అతుల్ణి నువ్వు రక్షించు కొన్నావు. ఆ మాత్రం కృతజ్ఞతను అతను చూపకపోడు. కృతజ్ఞతా సూచకంగా అతులుడు—'

'చెల్లీ, వింటున్నావా?'

దుర్గమణి వాక్య మధ్యంలోనే స్వర్ణమంజరి కలుగ జేసుకొని అన్నది:

'ఏమిటక్కయ్యా?' అన్నది దుర్గమణి.

‘ఏడుపులతో, ఓదార్పులతో నీకు ఆకలి లేకపోతే లేకపోవచ్చు. అందరికీ అలానే ఉండదు. నీకోసమని ఇంటిల్లపాదీ పస్తులుండరు చెల్లీ! ఒక్కసారి, ఇలా బైటికొచ్చి చూడు! ఎంత ప్రొద్దెక్కిందో తెలుస్తుంది.’

దుర్గమణి బైటకు వచ్చి చూచింది! నిజమే! చాలా ప్రొద్దెక్కింది! కూతురును పిలుస్తూ లోపలి కడుగేసింది. స్వర్ణమంజరి మనస్సు కొట్టుదిన్నట్లయింది. తీవ్రంగా దుర్గమణి వేపు చూసింది.

‘బాగానే ఉంది మీ మేళం! ముందెళ్లి వంట పని చూడు. తీరిగ్గా నీ గారాల కూతుర్ని తరువాత లాలించ వచ్చు. ఈ రోజు జరిగిందేదో జరిగి పోయింది. ఇక ముందు పిల్లా జెల్లా ఈ విధంగా ఆకలితో అలమటించడమనేది జరగడానికి వీల్లేదు. జరిగితే నేను సహించేదీ లేదు.’

అన్నది సంతాన హీనయైన స్వర్ణమంజరి, సంతానవతియైన మూడో తోడికోడలు పిల్లలకు కష్టం కలిగితే సహించ లేనన్నట్లు. ఈ మాటలని, జవాబు కోసం గూడా ఎదురు చూడకుండా, సర్రున ఇంట్లోకి వెళ్ళి పోయింది.

ప్రియనాథుడు చనిపోయినప్పట్నుంచీ, దుర్గమణి మరిది గారింట్లోనే ఉంటూ, వంట పని చేస్తున్నది. ఈ బాధ్యత గూడా లేకపోవడం వల్ల, పెద్దకోడలకూ, చిన్నావిడకూ కావలసినంత తీరికి దొరికింది. ఈ తీరికను, ఇరుగు పొరుగమ్మలతో ‘మా యింట్లో ఇప్పుడు ఖర్చు తెగ పెరిగి పోయిందమ్మా!’ అని చెప్పుకోవడంలో వినియోగిస్తున్నారు. దుర్గమణిని, జ్ఞానదను గురించి, అవాకులు, చెవాకులు ఆడిపోసుకోవడంలో ఖర్చు చేస్తున్నారు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, అనాథనాథుడో డెయిలీ ప్యాసింజరు లాంటివాడు. ఏ పరిస్థితుల్లోనూ, అతగాడు ఉదయం ఎనిమిదన్నర గంటల బండిలో ఆఫీసుకెళ్లి పోవాలి. ఆ కారణాన అనాథనాథునికి ఉదయమే భోజనం చేయడం రివాజయింది. అతని భోజనాన్ని గురించి— దాదాపు ప్రతిరోజూ, పెద్దావిడా చిన్నావిడా, ఏదో ఓ విధంగా హడావిడి పడుతుండే వాళ్ళు. కొన్ని సందర్భాలలో పోట్లాటలు గూడా అయ్యేవి.

ఈ పద్ధతిలో చాలాకాలం గడిచింది. కానీ అన్ని రోజులూ ఒక్కలాగా ఉంటాయా మరి? ఈ రోజు ఉదయమే చిన్న తుఫాను లేగింది. పనిమనిషి, ఇంకా నిద్రపోతున్న చిన్నకోడలిని లేపి అన్నది:—

'అమ్మగారూ! ఏడుగంటల ప్రొద్దెక్కింది. ఇంకా పొయిలో పిల్లి లేవనే లేదు. కాస్త మీరన్నా పొయ్యి రాజేయండి. లేకపోతే...'

చిన్నకోడలు గుగ్గిలంలా భగ్గుమన్నది.

'ఏమే! పొయ్యి రాజేయడానిక్కూడా నేనే లేవాలా? రెండో అక్కయ్యగారు, ఏడు గంటలయినా నిద్రలేవ లేదా ఏం?' అన్నది చిన్న కోడలు.

'అదేమిటమ్మా? ఆమెగారు ప్రొద్దుటే లేచారు.'

'మరింకేం? నన్ను లేపడ మెందుకే?'

'లేచి, బుట్టా తట్టా సర్దుకొంటున్నారండీ!'

'అలాగా?'

'అవునండీ! వారిపాలెం వెడతారేమో మరి! నాకు తెలియదు.'

ఈ చివరిమాట వినడంతో చిన్న కోడలికి నిన్న జరిగిన ఎన్నో సంగతులు స్ఫురణ కొచ్చాయి. ఇలా తమ 'పీడ' విరగడై పోతున్నందుకు—నిజంగా—ఆవిడెంతో సంతోషించవలసింది. కాని పోగా ఆమెకోపంతో తారామండలానికి లేచింది.

'ఏమిటేమిటీ? వారంతట వారే వెడుతున్నారా? నిజంగానా? అయితే బాబుగారికి ఈసంగతి తెలుసా? వారే వెళ్ళమన్నారా ఏమిటి? పోనీ, పెద్దక్కగారి కన్నా ఈ సంగతి తెలుసునటే!'

'బాబుగారి సంగతి నాకు తెలియదు గానండి - స్వర్ణమంజరిగారు మాత్రం ఈ పూటే వెళ్ళిపొమ్మన్నారండి.'

'అలాగా! అయితే మంచిది! వారిష్టం! వారెప్పుడెళ్ళినా అభ్యంతరము లేదుగానీ, ఎనిమిది గంటలకల్లా భోజనం సిద్ధంగా ఉండాలని మాత్రం వారికి చెప్పు.'

పని మనిషి చెప్పడానికి కదిలింది. అంత దాకా గూడా చిన్నావిడ ఆత్రం ఉండబట్టలేక, తనే స్వయంగా దుర్గమాశి దగ్గరి కెళ్ళింది.

'చిన్నకాక్కా! నువ్వెడుతున్నావన్న సంగతి మా కెవరికీ తెలియనే తెలియదు. సరే నీ యిష్టం! అలానే వెళ్ళవచ్చుగానీ, నే చెప్పేది

గూడా విను. నీ మరిదిగారేమో స్నానం చేయడానికని గంగానది కెళ్లారు. నేనా ఇప్పుడూ నిద్ర లేచింది. ఆయనగారు విధిగా ఆఫీసు కెళ్ళాలి గదా! ఇక బైముకు వారి కెలా భోజనం సిద్ధమవుతుందమ్మా?'

ఈ ప్రవాహం ఎంత దూరం వెళ్ళేదో చెప్పలేం గానీ, దానికి అతులుడొచ్చి అడ్డు పడ్డాడు. అతులుడు వస్తూనే, 'నమస్కారం అత్తయ్యా' అని ఓ నమస్కార బాణం ప్రయోగించాడు.

'ఎవరు?...నువ్వటోయ్ అతులా!' అన్నది చిన్న కోడలు,దుర్గమణికి పనులు పురమాయిస్తున్నదల్లా ఆగి. 'ఎప్పుడొచ్చా వేమిటి?'

అతులుడు కలకత్తాలో చదువుతున్నాడు. మకాం 'మెస్'లో పెట్టాడు. అక్కడుండగానే ఉత్తరం అందింది. ఆ వెంటనే బయలుదేరి వచ్చాడు.

'అత్తగారు హరిపాలెంలో కైవల్యం పొందేందుకు వెడుతున్నదని తెలిసి గూడా నేను రాకుండా ఉంటానా? మరేమియాడిపో బిరుదుగాంచిన హరిపాలెంలో, అత్త కాలు పెడుతున్నదని తెలిసి గూడా ఎలా రాకుండా ఉండను అత్తయ్యా? ఇప్పుడు అశ్వినీ నక్షత్రపు మొదటి పాదం ఘడియలు కదా! ఇంత ప్రొద్దుటే నిన్న వెళ్ళమన్న దెవరు? బాగానే ఉంది! సామానుగూడా సర్దుకొన్నారన్న మాట!' అన్నాడు అతులుడు గదిలోకి చూస్తూ.

నిప్పు కణికల్లా మెరుస్తున్న కళ్ళను, పైట చెంగుతో అద్దుకొంటున్న జ్ఞానద కనిపించింది.

'అతుల్ బాబూ!' అన్నది చిన్నకోడలు. 'వీరిలా వెడుతున్నారని నీకెలా తెలిసింది నాయనా?'

'నాకా?' అని ఫక్కున నవ్వాడు అతులుడు 'బావుంది'

తరువాత ఏమి చెప్పే వాడో అతులుడు, ప్రళయ మేఘ ధ్వనిలా స్వర్ణ మంజరి గొంతుక వినపడింది.

ఆవిడ ఎప్పుడో గంగానది కెళ్ళింది. స్నానాది కాలు నిర్వర్తించుకొని, ఆత్మను శాంతింప జేసుకొన్నది. పరిపూర్ణ ఆనందంతో ఇంట్లోకడుగు పెట్టగానే, 'పొయ్యిలో పిల్లి లేవలే' దని పని మనిషి చెప్పింది. ఆ మాట

వినడంతో, స్వర్ణమంజరి ఏమి కావాలో అదే అయింది. అసలు—రెండో కోడలు విధవరికాన్ని పొందింది—వంట పని చేయడానికేనని, ఆమెతో బాటు ఆ యింట్లోని వారంతా అనుకున్నదే! స్వర్ణమంజరి ఆవేశాన్ని తట్టుకోలేక, గబగబా రెండో కోడలి గదివేపు కొస్తూ అన్నది:

'చిన్న బాబు కూడు కుమ్మూ లేకుండా ఇంత ప్రొద్దుటే, పనిలో కెళ్ళి, ఈసురోమంటూ సాయంత్రానికి కొంపకు తిరిగి రావాలని నీ కున్నదా ఏం? నీ ధోరణి చూస్తుంటే, ఆయన కే రోగమో పట్టుకొని... నీలాగా సర్వనాశనం కావాలాని నీ ఉద్దేశమేమో ననిపిస్తున్నది!'

'అక్కా !' అన్నది దుర్గమణి లోలోపల భయపడుతూ. 'తనకు పట్టిన దుర్గతే, అందరికీ పట్టాలని, ఏ ఆడదీ, ఎప్పుడూ అనుకోదను కొంటాను. అయినా—బాణాల్లాంటి ఇటువంటి మాటలని, నన్ను ఖేదింప చేయడానికి, నీకు నేనేం కీడు చేశానక్కాయ్?'

అతులుడు ఇదంతా వింటున్నాడే గానీ,ఏమీ మాట్లాడ లేదు. స్వర్ణమంజరి మన స్తత్వం అతనికి తెలుసు. అందుకే మౌనంగా ఉండిపోయ్యాడు. కానీ, పెద్దత్త గారన్న ఆ చివరి మాటలు అతని కెంతో వ్యథ కలిగించాయి.

'అత్తాయ్! నిజమాడితే నిష్ఠూర మొస్తుందంటారు. తినడానికీ, కట్టడానికీ, ఇంత సంపద ఉన్నవారెవరూ, మీ అన్నానికి ఆశించరు. ఆశించరని మీకూ తెలుసు. మీ వీధిలోని వారికీ తెలుసు. ఈ దురదృష్ట వంతులు, ఈ రోజే వెళ్ళవలని వచ్చినందుకు విచారిస్తున్నాను. దయచేసి మీరు ఊరుకోండి. ఒక మహాభారత యుద్ధాన్ని ఆపిన ఫలం మీకు దక్కుతుంది!' అన్నాడు అతులుడు.

అతులుని మాటలు చిన్నావిడకు, పెద్దావిడకూ గూడా కష్టం కలిగించాయి. దేవరాణి ఏమోలే అని ఊరుకొన్నా పెద్ద కోడలు మాత్రం ఊరుకోలేగు.

'ఏం నాయనా! కలకత్తా నుండి తమరు వచ్చింది—మాతో దెబ్బలాడటానికేనా ఏమిటి?' అన్నది స్వర్ణమంజరి.

'దెబ్బలాడేందుకు కాదక్కయ్యా! దుర్గక్కయ్యను గంగా స్నానం కోసం హరిపాలెం పంపుతున్నాం గదా మనం! చివరిసారి చూడాలని వచ్చాట్ట' అన్నది దేవరాణి.

'అహాఁ. అదా సంగతి!'

'అవునక్కయ్యా! అతులుడందుకే వచ్చాడు. ఇంత మందిమి ఇక్కడున్నాం గదా! దుర్గక్కయ్య హరిపాలెం వెదుకుతున్న సంగతి మనకెవరికీ తెలియనే తెలియదు గానీ, కలకత్తాలో ఉంటున్న అతులునికి మాత్రం తెలిసింది. ఎలా తెలిసిందా అనే నేనాలోచిస్తున్నాను. దీన్నిబట్టి చూస్తే నాకేమనిపిస్తున్నదంటే, లోకులను కొంటున్న వేవీ అబద్ధం కావేమోనని-'

స్వర్ణమంజరి ఢగ్గున మండి పడ్డది.

'అబ్బాయీ! నీ మనస్సులో, వీరిని గురించి ఇంత ఆవేదనున్నదని నాకు తెలియదు. అంతగా ఆరాటపడే వాడివి, వీరిని గంగలో కలపడమెందుకు బాబూ? నీ యింటికి తీసుకెళ్ళి పెట్టుకో. సాకు, రక్షించు. అందులో ఇప్పుడావిడ నీకు—నిజంగా అత్తగారు కూడా అయ్యె. తప్పేముందీ! పైగా చూసిన వారు గూడా, నిన్నభినందిస్తారు. ఆ పని చెయ్యగూడదూ!'

ఈ విష జ్వాలలకు అతులుడు నిల్చుకోలేక పోయాడు. ఆతని మనస్సు కకావికలైంది.

'అత్తయ్యా! చాలా మంచి మాటన్నావు! మా యింటికి రావడానికి వీరికేమీ అభ్యంతరం లేక పోతే, నాకూ లేదు. తప్పకుండా తీసుకెళతాను. మా ఇంట్లోనే ఉంచుకొంటాను. పరోపకార మెప్పు కోసమని నేనీ పని చెయ్యడం లేదు. ఇది విని, మీ ఊరి వారు నన్ను అభినందించినా, అభిశంసించినా నేను లక్ష్యపెట్టను.'

అన్నాడు అతులుడు. ఈ మాటలన్న తరువాత గిర్రున వరండా నుండి, ఒక్క క్షణంలో అంగదనీ బైటికి తీసుకెళ్ళి నిలబడ్డాడు.

ఎడ్లు బండి వచ్చింది.

'అమ్మా బండెక్క, వేగయిండండి! ఏమున్నా సామానుంటే చెప్పండి బండిలో పెడతాను. ఇప్పుడిప్పుడే ప్రయాణం గాక పోతే, రైలు మనం బండిని పట్టుకో లేమండీ!'

అతులుడు నిశ్శబ్దంగా వెళ్ళి పొయ్యాడు.

ట్రంకును, పక్క చుట్టను దుర్గమణి చూపిస్తే, బండివాడు నెత్తి కెత్తుకొని బైటికొచ్చాడు. స్వర్ణమంజరి, దేవరాణి, విసురుగా లోపలి కెళ్ళి పోయ్యారు. దుర్గమణి తాళం వేస్తూ 'దుర్గా! దుర్గా!!' అని, జ్ఞానద చెయ్యి పుచ్చుకొని బండిలో కెక్కి కూర్చుంది. పిల్ల మూర్ఛపోయిన దానిలా, కళ్లు మూసుకొని, నిస్తేజంగా, నిశ్చలంగా, నిరీహంగా, తల్లి హృదయాని కానుకొని జారగిల బడింది.

బండి కదిలింది.

పుష్కరం గడిచి పోయిన తరువాత, వైధవ్య భారంతో దుర్గమణి పుట్టింటి కొచ్చింది. ఆ శరదృతువు నాటి సాంధ్య వేళ వాతావరణంలో, తన పుట్టింటి పరిసరాలు ఆమె కెంతో ఏహ్యాన్ని కలిగించాయి. ఇప్పుడా ఇంటిలో కన్నతల్లి గానీ పోషించిన తండ్రిగానీ లేరు. అన్న మాత్రమే ఉన్నాడు. అతనైనా మరేదియా రోగి. శంభు ఘటర్జీకి ఆ రోజు వరుస దినం! రానున్న చలి జ్వరపు దెబ్బ కాచుకోడం కోసమని శంభు ఘటర్జీ ముందుగానే మంచంలో ముడుచుకుని పడుకొన్నాడు.

ఎవరో వచ్చినట్టు తెలిసింది. అలానే లేచాడు. ముఖానికి విభూతి రాచుకొన్నాడు. కుండలాలు పెట్టుకొన్నాడు. బైటకొచ్చి, వచ్చిన వారిని చూసి గూడా చప్పున గుర్తించలేక పోయాడు.

'ఎవరది? దుర్గా! ఇంటి దగ్గిర నుండి ఎప్పుడు బయలు దేరావమ్మా? బావుంది... రా అమ్మా రా!' అన్నాడు ఘటర్జీ.

దుర్గమణి పొంగు కొస్తున్న విచారాన్ని దిగమ్రింగుతూ అన్నగారికి నమస్కరించింది. జ్ఞానద గూడా ప్రణమిల్లింది.

'దుర్గా! ఈ పిల్ల నీ కూతురే కదూ? పెళ్ళికూడ చేశావమ్మా?' అన్నాడు అన్నగారు.

'ఇంకా లేదన్నాయ్! ఇదుగో... తొందర్లో ఎక్కడన్నా ముడి పెడదామనీ...'

'ఏమిటీ?' అని విస్తుపోయాడు శంభు ఘటర్జీ. 'ఈ పిల్లకింకా పెళ్ళి చెయ్య లేదు టే? నువ్వు-దీన్నింకా చిన్న కుంక అనుకొన్నావేమో గానీ, కాదమ్మాయ్! ఆ ఈడు దాటి పోయిందిది.'

ఎంతో కాలం నుండీ,ఒకరి నొకరు చూసుకోక పోవడం మూలాన్ని ఆ అన్నగారి మనస్సులో దుర్గమణి పట్ల అనురాగ మేమాత్రమో, ఉదయించడమే జరిగితే, అది తిరిగి అస్తమించ డానికి ఎక్కువ కాలం పట్టలేదు.

'నువ్వింకా ఉత్తినే వచ్చావను కొన్నాను. వెంట ఓ గుది బండను తెచ్చావన్నమాట. బాగానే ఉంది ..' అన్నాడు ఛటర్జీ విసుగ్గా. 'అది గాదమ్మాయ్! ఈ సంగతి ఇక్కడి వాళ్లకు తెలిస్తే, ఇంకేమయినా ఉన్నదా? సరే! జరిగిందేదో జరిగింది. ఇప్పుడు విచారించి లాభం లేదు. కాస్త ఈ పిల్ల దాన్ని, వంట గదిలోకి, పూజా మందిరంలోకి రాకుండా చూస్తుండు. ఈ ఊరి వారి సంగతి నీకు తెలియుందా అమ్మా! ఇలాంటి బాడ ఖోప్ వెధవలు, ఈ దేశం హోల్ మొత్తంలో ఉండరంటే నమ్మ ...అయినా, నువ్వుగూడా, ఇలాంటి పిల్లను వెంటేసుకు తిరగడం లాయికీగా లేదు...దీన్ని చిన్నాన్నగారింటి దగ్గర దిగవిడిచి వచ్చినట్లయితే, పది రోజులపాటు, హాయిగా, ఇక్కడుండే దానివి. సరే ఇంట్లోకి పద... ఏమేవ్! ఏం చేస్తున్నావే! ఒక్కసారి ఇలారా...!' అంటూ ఛటర్జీగారు లోపలి కెళ్ళారు. ఆ తల్లి కూతుళ్ళు ఎలా అతన్ననుసరించారో భగవంతునికే తెలియాలి.

దుర్గమణి 'వదిన'ను గుర్తించ లేదు. ఆమెకు శంభుగారి ప్రథమ కళత్రమే తెలుసు. అన్నయ్య రెండో వివాహం చేసుకున్న తరువాత దుర్గమణి ఈ ఇంటికి రావడం ఇదే మొదటిసారి. మొదటి భార్యకూ ఈమెకూ, ఎక్కడా పోలికే లేదు. ఈమె నల్లగా, బొగ్గులాగా ఉంటుంది. దానికి తోడు ఎండుకు పోయి కొయ్యబొమ్మకు మల్లే ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే-కొద్ది భేదంతో-ఆరిపోయిన కొరకచ్చుకూ ఈమెకూ సారూప్యము చాలా ఎక్కువ.

గత మూడు రోజులుగా నిలవుండి మురగెత్తిన పేడను వంటలుగా చేసి, గోడకు కొట్టి, చేతులు కడుక్కొని, సంధ్యా దీపం వెలిగించేందుకు వెడుతున్న ఆ 'కొరకచ్చు' భర్త పిలుపు విన్నదై, వెనక్కు వచ్చి, భర్త వెనగ్గా నించున్న ఆ యిద్దరి క్రొత్త వారినీ చూసింది. భార్యకు వారిని పరిచయం చేశాడు ఛటర్జీ. తనకు మళ్లా జ్వరం ముంచు కొస్తుందేమోనన్న భయంచేత, ఎక్కువ సేపు అక్కడ నిలవకుండా, చప్పు చప్పున తన గదిలోకి వెళ్ళి పోయాడు.

'భామిని' స్వభావం అట్టే సరళమయింది కాదు. కుటిలత్వం ఆమె కాజన్మ సిద్ధమైన విద్య. పళ్లు వెళ్ళు కొచ్చేలా నవ్వుతూ, దుర్గమణి చేయి పుచ్చుకొని, చాప మీద కూర్చొన బెట్టింది.

భామిని చేసే చేష్టలు, మాట్లాడే పద్ధతీ దుర్గమణికి ఎబ్బెట్టుగా ఉన్నాయి. ఆమెకు వళ్లంతా కంపర మెత్తింది. వస్తూ వస్తూ ఒక పాత్ర నిండా రసగుల్లాలు తెచ్చింది దుర్గమణి. అవి బైట పెట్టీ పెట్టకముందే, ఆడా మగా పిల్లలు ఈగ ముసిరినట్టు ముసిరారు. వాళ్ల గోలతో, ఆ గది చేపల బజారులా తయారయింది. భామిని, ఒకళ్ళకు సగమూ, ఇంకొకరికి కొద్ది గానూ, మరొకరికి సుమారుగా 'ఇంత' పెట్టి, పాత్రను తీసుకెళ్ళి, తన పడక గదిలోని ఉట్టిమీద భద్రం చేసింది. పిల్లవాళ్ళు అందిన మట్టుకు చక్కగా మెక్కారు. తిన్న తరువాత, వేళ్ళ కంటిన పానకాన్ని నాకుతూ ఎక్కడి వారక్కడి కెళ్ళారు.

దుర్గమణి జన్మస్థలమిదే గనుక, ఈ ఇంటి వ్యవహారా లామెకు పూర్ణంగా తెలుసు. బజార్లల్లోనూ, ఇళ్ళల్లోనూ, ఏడెనిమిది సంవత్సరాల పిల్లలు గూడా, గుడ్డ గోచీ లేకుండా తిరగడం జ్ఞానద చూసింది. ఈ దృశ్యం ఆమె కెంతో రోత కలిగించింది. ఈ పద్ధతి నామె ఆమోదించ లేక పోయింది. కావడానికి తన ఊరుగూడా చిన్న పల్లెటూరే గానీ, దానికీ దీనికీ ఎక్కడా పోలికే లేదు. అక్కడ, నడిచే బజార్లు ఊడ్చి శుభ్రం చేస్తారు. ఇక్కడి వారి కదేమిటో తెలియదు. దోవల్లోకి, మామిళ్ళు, పనసలు, వెదుళ్ళు చొచ్చుకొనుంటాయి. వాటిని తప్పించు కొంటూ నడవాలి. ఈ బాధ తన ఊరికి లేదు. మురుగొత్తి, ముక్కును బద్దలుకొట్టే, పేడ వాసన తన ఊళ్ళో ఉండదు.

ఇంకా చీకటి పడలేదు. ఓ నక్క గుమ్మంలోకి వచ్చింది. పెద్దకుర్ర వాడు, అది వచ్చీ రాక ముందే తరిమేశాడు. ఇంటి గోడప్రక్కనే ఉన్న చెట్లనుంచి, ఏదో వికార ధ్వని జ్ఞానదకు వినిపించింది. అటువంటి ధ్వని ఇంత వరకూ ఆమె వినలేదు. భయపడి, 'అదేమిటమ్మా?' అన్నది తల్లితో.

'అదా! పాము.' అన్నది భామిని సమాధానంగా.

జ్ఞానద కంపించి పోయింది.

'ఏమిటీ? ఆ అరిచింది పామా?'

'అవును జ్ఞానదా! అది పామే! ఇక్కడున్న ప్రతి చెట్టు కొమ్మకూ పాములుంటాయి!' అన్నది భామిని తిరిగి.

భామిని ప్రత్యుత్తరం విని తల్లి వేపు చూసింది జ్ఞానద. ఆమె మనస్సు అంత క్రితమే భయంతో నిండి పోవడంవల్ల, ఈ వార్తలు మరింత ఆమెను భయ భ్రాంతను చేశాయి. తల్లి వక్షాని కానుకొని జ్ఞానద ఇలా అన్నది:

'అమ్మా! పోదాం పద. ఇక్కడ నేనో క్షణమయినా ఉండలేను. ఉండటం నా వల్ల కాదు.'

'భయ పడటాని కిందులో ఏమున్నదమ్మాయ్!' అన్నది భామిని, ఆమెకేసి ఏద్దూరంగా చూస్తూ. 'పామన్న మాటేగానీ, అది దేవతలాంటి దమ్మా! ఇన్నాళ్ళ నుండీ చూస్తున్నాను గదా, ఒక్కరి కన్నా, ఒక్క అపకారమన్నా అది చేయలేదు. నీవంతా అడవి మేళం గాకపోతే, దేవు డిచ్చిన ఆయువుంటే, పాము కరిస్తే చచ్చి పోతారా జ్ఞానదా? మరేమీ ఫరవా లేదు. ఇక్కడ భయపడవలసిందల్లా మలేరియా వ్యాధికే; ఒక్కసారి అది మనిషిని పట్టుకొన్నదంటే, పీల్చి పిప్పి చేసిందాకా మరి వదలదు. ఇరవై రోజుల నించీ మీ మామగారిని పట్టుకొన్నది. రక్త మాంసాలు పీల్చి బొమికెల గూడును మిగిల్చింది. నువ్వు చూశావుగా! ఇరవై రోజు లయిందో లేదో, నూరేళ్ళ ముసలాయనలా తయారయ్యాడు. రెండుమూడు సంవత్సరాలు నిలబడి ఉంటుందా-దీని ప్రభావం మరీ ఎక్కువై పోతుంది. ఆ రోజు కీ ఊళ్ళో, ఇన్ని నీళ్లు పోసే దిక్కన్నా ఉంటుందో ఉండదో ఎవ్వరూ చెప్పలేరు.' అన్నది భామని.

స్వర్ణ మంజరితో 'పోరాటం' జరిపి, ఇక్కడికి బయలుదేరిననాడు; ఈ విషయాలన్నీ అతులుడు వైనవైనంగా చెప్పాడు. చెప్పాడన్న సంగతి జ్ఞానదకు ఇప్పుడే స్ఫురణ కొచ్చింది. భయంగా, నీరసంగా, తల్లిని కరుచు కొని పడుకొన్నది జ్ఞానద. ఆ రాత్రి ఆమె నిద్ర పోలేదు. తెల్లవార్లూ ఉలిక్కి పడుతూనే ఉన్నది. కోడికీ ఆమెకూ తెల్లవారింది.

ఆ అవివాహిత యువతిని చూసి, ఊరివారు పడ్డ ఆశ్చర్యానికి మితి లేక పోయింది. పెళ్ళి కాని ఆడవారి వయసు బెంగాలీయులు ఖచ్చితంగా చెప్పరు. పిల్ల నిజమైన వయస్సును రెండు మూడేళ్లు తగ్గించి చెప్పడం

రివాజని అందరకూ తెలుసు. అడిగిన వారికి జ్ఞానద వయస్సు పదమూడు సంవత్సరాలని దుర్గమణి చెప్పిందిగానీ, జాతీయ సాంప్రదాయం ప్రకారం ఎవ్వరూ నమ్మలేరు. ఆ సంఖ్యకు మరో రెండేళ్లు కలిపి, జ్ఞానద వయస్సు పదిహేను సంవత్సరాలకు ఏ మాత్రమో, పై మాటేగానీ, తగ్గవని అందరూ నిర్ధారించుకొన్నారు.

వారిని తప్పు పట్టనవసరం లేదు. జాతీయ సాంప్రదాయ ప్రకారం కాక పోయినా, జ్ఞానదను చూసిన వారెవరూ, ఆ పిల్లకు పదమూడేళ్ళంటే చెప్తే నమ్మరు. తల్లిదండ్రులకు పుట్టిందే ఒక్కర్తె గనుక, తల్లిదండ్రు లామెను చాలా గారాబంగా పెంచారు. తాము తిన్నా తినక పోయినా, పిల్ల దాని కేలోటూ రానీయ లేదు. ఆమె అడిగినవన్నీ తెచ్చి పెట్టేవారు. కాబట్టే జ్ఞానద, లావుగా, ఏపుగా ఎదిగింది. కావడానికి నల్ల రూపయినా, అది కాకి నలుపు కాదు. దానికో అందమున్నది. ఆ రంగుకూ కొంత తళ తళల మెరుపులున్నాయి. ఆమె పొంకమైన శరీర దార్ఢ్యం చూసిన వారెవరూ, ఆమెకు పదమూడేళ్ళని—అది నిజమైనప్పటికీ నమ్మరు.

ఇలా రెండు మూడు రోజులు గడిచాయి.

ఒకనాడు ఏదో మాటల సందర్భంలో ఘటక్జి చెల్లెలితో ఇలా అన్నాడు:—

'దుర్గా! నీ మూర్ఖత వల్ల నాకు చచ్చిన చావుగా ఉంది. పది మందిలో తలెత్తుకు తిరగ లేక పోతున్నాను. నా సంగతి వదిలెయ్. నువ్వు మాత్రం కుర్ర దానికి పెళ్ళి పెటాకులూ లేకుండా ఎంత కాలమని ఉంచు తావు గనక? నాకు తెలిసిన మంచి సంబంధ మొకటున్నది. మరి దానికి ముడిబెట్టేస్తావా?'

'అన్నాయ్!' అన్నది దుర్గమణి. 'వరుడిని వరకే నిశ్చయించబడ్డాను. అతనికి తప్ప మరొకరికివ్వ గూడదని గూడా నిర్ణయించుకొన్నాను!'

'అయినా మించిపోయిందిలేదు.' అన్నాడు అన్నగారు. 'ఇలాంటి సంబంధాలు అన్నప్పుడెల్లా రావు. దానికెంతో పూర్వజన్మ పుణ్యం ఉండాలి. పిల్లాడికేమీ! రత్నంలాంటి వాడు. సుక్షేత్రమైన పాతికెకరాల పొలముంది. పెద్ద చెరువుంది. చక్కని తోట ఉంది, బోలెడన్ని ధాన్యపు పురులు

ఉన్నాయి. ఇవన్నీ తీసిపారెయ్! పుత్రవాడు బాగా చదువుకొన్న వాడు. బుద్ధిమంతుడు.'

ఇంకేదో చెప్ప బోతుంటే దుర్గమణి, మధ్యలోనే అందుకొన్నది-

'అది కాదన్నాయ్! మరొకరికిచ్చి దీన్ని పెళ్ళి చెయ్యడమనేది కుదరదు...ఇంకో సంవత్సర మాగాక, ఆ పిల్లవాడికే యిచ్చి ముడి బెట్టేస్తాను. అంతేగానీ...'

'సంవత్సరం దాకా ఎందుకే దుర్గా? వచ్చే మార్గశిర మాసంలో, దీని బెడద వదిలించు కొందామని నేను చూస్తుంటే, నువ్వు సంవత్సరం తరవాత సంగతి చెబుతా వేమిటే నాకు?'

ఇక ఈ విషయమై అన్నగారితో వాదించడం బావుండ దనుకొని, దుర్గమణి, ఏదో మిషమీద అక్కడి నుండి వెళ్ళి పోయింది. నాలుగైదు రోజుల తరువాత అసలు సంగతి బైటపడ్డది. శంభుగారు మాట్లాడుకొచ్చిన సంబంధం, మరొకడికో కాదు. భామిని అన్నగారే ఆయన.

ఆ 'అన్నగారు' భార్య ఇహ లోకం విడిచిన అయిదారు నెలల పాటు బ్రహ్మచారిగానే ఉన్నాడు. అయితే, అలా ఎక్కువ కాలం ఉండటం కష్టమని, ఆయనకు స్పష్టపడి పోయింది. దీనికి తోడు పిల్లా పీచూ ఉన్నారు. ఎక్కడన్నా కాస్తంత ఎదిగిన పిల్లను చేసుకొంటే, ఏ బెడదా ఉండదని ఆయనగారి నమ్మకం.

దుర్గమణి కీ సంబంధం బొత్తిగా ఇష్టం లేదు. ఒక నాడు ఆయనగారి కంట-దురదృష్ట వశాత్తూ జ్ఞానద పడ్డది. వెంటనే ఆమెను 'ప్రేమించాడు.' ఆమెను వదిలి ఉండలే ననుకొన్నాడు. అందుకు శంభుగారు గూడా ప్రక్క తాళం వేశారు.

'జ్ఞానదకు పెళ్ళి చేయకుండా ఎక్కువ కాలం ఉంచడానికి వీలు లేదు. దీన్ని కన్యాదానం చేసే వాకుక్క, ప్రియనాథుని తరువాత నాకే ఉన్నదని నీకు తెలియదను కొంటాను. ఏది ఏమైనా సరే! మార్గశిర మాసంలో, దీనికి పెళ్ళిచేసి తీరతాను.' అని తెగేసి చెప్పాడు భటర్జీ.

అన్నగారితో వాదించడం ఆమె కిష్టంలేదు. లోపలికి వెళ్ళి పోయింది. గండరించిన జ్ఞానద ముఖము, జేవురించిన కళ్లూ మాసి, అన్న

గారి మాటలన్నీ కూతురు విన్నదని దుర్గమణి గ్రహించింది. కూతురును దగ్గరగా లాక్కొని 'అమ్మడూ! నా కంఠంలో ఊపిరుండగా, నీ కొచ్చిన భయమేమీ లేదు. నువ్వు నిశ్చింతగా ఉండు!' అన్నది దుర్గమణి.

అనడం సులభం గనుక, దుర్గమణి కూతురుతో అలా అన్నది. అభయ ప్రదానం గూడా చేసింది. కానీ, ఆమెగూడా భయంతో కంపించి పోతున్నది. ఆ చుట్టు ప్రక్కల గ్రామాల్లో, బలవంతంగా పెళ్ళిళ్ళు చేయడం చాలా సామాన్య కార్యమని ఆమెకు తెలుసు.

జ్ఞానద వెక్కి వెక్కి ఏడ్చింది.

దుర్గమణి కూతురు తల నిమురుతూ 'తల్లీ! జ్వర మెప్పట్నుంచీ?' అన్నది.

'నిన్నటి రాత్రి నుంచి'

'నిన్న రాత్రి నుంచీ జ్వరం తగులు తుంటే, నాతో ఎందుకు చెప్ప లేదమ్మా! ఇది మలేరియా రోగాలకు పుట్టిల్లు గదా! మాట మాత్రమైనా నాతో అనలేదేం జ్ఞానదా!'

జ్ఞానద మాట్లాడ లేదు.

దుర్గమణి, వదిన మనస్సును ఆకట్టు కొందామన్న ప్రయత్న మెప్పుడూ చెయ్యలేదు. ఆ వికారాకారము, వికృతపు నవ్వు, నడవడికలు చూస్తుంటే, దుర్గమణి శరీరం అసహ్యంతో కుంచుకు పొయ్యేది. ఆమె కంఠస్వరం దుర్గమణికి ఎంతో ఏవగింపు కలిగించేది. పల్లెటూరి ముద్దరాలులా కాకుండా, భామిని కయ్యానికి కాలు దువ్వు తుండేది. ఇవన్నీ నిజమేగానీ, మరొక రకంగా చూస్తే భామిని ఉత్తము రాలనక తప్పదు. ఆ భాగ్య శాలికి ఇంకొకరి జోలి కొంతీ అక్కర్లేదు. ఎవరి పని వారు చూసుకొంటుంటే నోరెత్తదు. తను, తన క్షేమము, తన ఇల్లు, తన పిల్లలు, తన కారోగ్యం, తన కాయుష్యం మినహా, మరో విషయం ఆమె ఆలోచనలోకే రాదు. రాదని దుర్గమణికి గూడా తెలుసు.

వచ్చిన తొలిరోజుల్లో వదినకు సాయం చేదామని, దుర్గమణి వంటింట్లో కెళ్ళింది. భామిని ఆడబిడ్డను ఒక్క పనీ ముట్టుకోనివ్వ లేదు.

'రెండు రోజు లుండి పోదామని, నువ్విక్కడి కొచ్చావు వదినా! నీ చేత నేను చాకిరీ చేయించుకోనా? నలుగురూ వింటే ఏమనుకొంటారు?

నువ్వు నాకే సాయమూ చేయవద్దు. అన్నీ నేను చూసుకొంటాను గానీ, మీరలా వెళ్లండి!' అన్నది భామిని.

అనే ఆఖరు దుర్గమణి వంటింట్లోకి రావడం. ఈనాడు, భోజనానికి చాలా ఆలస్యంగావడం వల్ల, భామిని వంటింటి గుమ్మంలో కొచ్చి అన్నది:

'వదినా! మీ కోసమని ఎంత సేపని కూచోవాలో చెప్పండి. అంత సేపూ అలానే ఉంటాను...కాక పోతే ఏమిటి వదినా? ఎంత ఎండెక్కిందో చూడు ..అసలు—నువ్వీ పూట భోజనం చేయవా ఏమిటి?'

'పిల్ల దానికి, జ్వరం మరీ మోపుగా ఉన్న ద్దొదినా! ఈ పూట నేనేమీ తినలేను. జ్ఞానద కూడా తినదు. మీరు వెళ్ళి భోం చెయ్యండి.'

'జ్వర మొచ్చింది గనక జ్ఞానద అన్నం తినక పోవచ్చుగానీ నువ్వెందుకు తినగూడదమ్మా వదినా? అయినా ఉపవాసం చేయవలసిన అగత్య మేముందీ? జ్వరం రావడం విడ్డూరం కాదు. అది సర్వసామాన్యమైన విషయం. లేవండి వదినా! ముందు అన్నం తిందురుగాని పదండి!'

'వద్దు వదినా!' అన్నది దుర్గమణి. 'పిల్లదాన్ని ఈ స్థితిలో ఉంచి, నేను ఎంగిలి పడలేను. అం హ...నన్ను బలవంత పెట్టకు భామినీ!'

'నీ మాటలన్నీ విరుద్ధంగా ఉంటాయి వదినా!' అన్నది భామిని వంటింట్లో కెళ్ళి. 'జ్వర మొస్తే వైద్యుణ్ని పిలుస్తారు. మాత్రగానీ; చూర్ణం గానీ ఇస్తారు. అంతేగానీ, మలేరియా రోగానికి ఉపవాసం చెయ్యడం నే నెరగను. ఈ ఊళ్ళో ఇలా చేసే వాళ్లు-మచ్చుకు గూడా లేరు.'

ఆ తరువాత భామిని తన పనుల్లో మునిగి పోయింది.

దుర్గమణి ఏ సమాధానమూ ఇవ్వలేదు.

ఏను కూక బోతున్నది. ఆ వేళప్పుడు, భామిని ఓ గ్లాసుతో జ్ఞానద దగ్గర కొచ్చి, 'నీ కోసమని మందు తెచ్చానే పిల్లా! మాత్ర కాస్త వికారపెడుతుంది. మింగలేవని, నీళ్లల్లో కలుపు కొచ్చాను. లే. కాస్త తాగు. తాగిన తరువాత, అన్నంలో నీళ్లోసి ఉంచాను. తిందువు గాని. —'

వస్తుతః భామినిని చూడటమంటే జ్ఞానదకు వల్లమాలిన భయం. అందులోనూ త్రాగవలసింది మందు. అందుకనే ఆమె రెండు కళ్ళూ గట్టిగా మూసుకొని మింగేసింది.అయితే ఆ మందు జ్ఞానదకు ఇమడ లేదు.

వెంటనే వాంతి చేసుకొన్నది. జ్ఞానద కక్కుకోవడం భామినికి వినిపించి, చప్పున పరుగెత్తు కొచ్చింది. ఆ సమయంలో దుర్గమణి గూడా ఇంట్లో లేదు. భామిని నిశ్శబ్దంగా కొన్ని క్షణాలు జ్ఞానద వైపు చూచి, తరువాత బైటికొచ్చి ఇరుగు పొరుగు వారితో ఇలా అన్నది:

'ఈ పిల్ల మహారాజుల ఇళ్లల్లో ఉండవలసింది. ఖర్మ గాలి మాలాంటి పేద కొంపల కొచ్చింది.'

జ్ఞానద వ్యాధి రోజు రోజుకూ ముదిరి పోతున్నది. దుర్గమణికో భయం పట్టుకొంది. తాము ఇక్కడికి కొచ్చిన కొత్తలో భామిని—

'సాము కరిస్తే చస్తారుటమ్మా ఎక్కడైనా? అదసలు కరవనే కరవదు. ఇక్కడ చనిపోయే వారంతా, మలేరియా మూలంగానే చని పోతుంటారు. అది ఒకసారి మనిషిని పట్టుకొన్నదంటే-ఒకంతట వదలదు' అన్నది.

దీని నిజా నిజాలను తేల్చుకోవడానికి ఎక్కువ రోజుల అవసరం లేక పోయింది. మలేరియా జ్వరం జ్ఞానదను కట్టెను చేసి వేసింది.

ఆనాడు కార్తీక సంక్రాంతి. భామిని, జ్ఞానద వద్ద కూచుని తల నిమురు తుండటాన్ని, గదిలో కొస్తున్న దుర్గమణి చూసి ఎంతో ఆశ్చర్య పోయింది. ఇలా కారుణ్య పూరితంగానూ, ఆదర పూర్వకంగానూ, భామిని ప్రవర్తించగలదని దుర్గమణి ఏనాడూ ఊహించ లేదు. ఇంట్లో చేయవలసిన పనులు బోలెడున్నాయి. వాటి నన్నింటినీ కాలదన్ని జ్ఞానదకు పరిచర్యలు చేస్తూ భామిని కూచోవడంలోని అంతరార్థ మేమిటి? అది గూడా కాకుండా, అయిన వారికేగానీ, ముక్కూ ముఖా లెరుగని పరాయి వారికిలా సేవ చేయడం తనకు తెలియదు. అయినా చేస్తున్నదంటే, అందు కెంతో ఓర్పు కావాలి. భామినిలోని ఈ 'ఓర్పు' పరిమాణాన్ని చూసి దుర్గమణి విస్తుపోయింది.

ఒకప్పుడు శంభు భట్టర్జీ గారు, జ్ఞానద వివాహ విషయం ప్రస్తావించి, తన నిర్ణయాన్ని తెలియ చేసిన సంఘటన దుర్గమణి స్మృతి పథంలో మెరిసి ఆమెను వివ్వాలను చేసింది. తన అన్న గారికి, జ్ఞానదనిచ్చి పెళ్ళి చేయించడం కోసరమే, భామిని ఇంత సరసంగా, ఆదరంగా ప్రవర్తిస్తున్నదేమో

నన్న అనుమానం దుర్గమణికి కలిగింది. సహజంగా-కఠినాత్మురాయైన భామి నిలో, ఇటీవల కానవస్తున్న పరిణామాలకు, మరో విధమైన జవాబు నామె చెప్పలేక పోయింది. ఈ దృశ్యం-ఆమె అనుమానాన్ని మరింత బలపరి చింది కూడాను.

'వదినా!' అన్నది భామిని, గదిలో కొస్తున్న దుర్గమణిని చూస్తూ. 'తారకేశ్వరంలో అనుభవజ్ఞుడైన వైద్యుడెవరో ఉన్నాడట. ఆయన్ను వెంటబెట్టుకు రమ్మని మీ అన్నగారిని పంపాను...ఆ రోజు కారోజు జ్ఞానద వ్యాధి పెరుగుతున్నదే కానీ,తరగడం లేదు. అలాంటప్పుడు మనం, ఏదో గట్టి చికిత్స చేయకుండా ఉపేక్షించడం భావ్యం కాదు.'

అందుకు సమాధానంగా దుర్గమణి ఏమిటో అన్నది. అయితే దాన్ని భామిని వినలేదు. ఎంతో తృప్తినిచ్చే, ఇలాంటి మాటలు భామిని నోటంట విన్నప్పటికీ, దుర్గమణి ఏ కారణం చేతనో ఆనందించ లేక పోయింది—

ఈ మాటలని-భామిని ఇంటి పనులు చూసుకొందుకు లోపలికెళ్లి పోయింది. అత్త వెళ్లగానే, అటూ ఇటూ చూసి, తలగడ క్రింద జ్ఞానద నుండి ఓ కాగితాన్ని లాగుతూ 'అమ్మా! ఆయనీ ఉత్తరం ఇచ్చి వెళ్లాడే!' అన్నది.

'అలాగా! ఏదీ చూస్తాను!' అంటూ ఆత్రం కొద్దీ కూతురు చేతుల్లో నుండి ఆ కాగితాన్ని లాక్కున్నదే గాని చదవలేదు. గుప్పిటిలో బిగించి పట్టుకొన్నది. ఒక్కసారి గుప్పిటను తెరిచి, ఆ ఉత్తరంలో ఏ మున్నదో చూతామన్న కుతూహలం కలిగింది. అయినా దుర్గమణి ఆ పని చెయ్యలేదు. ఆ ఉత్తరం కూతురు కోసం వ్రాయబడ్డది.తనకిచ్చిందిగూడా కూతురే! అలాంటప్పుడు దాన్ని తను చూడటం ఏమంత భావ్య మనిపించు కుంటుంది? తల్లినయి ఉండిగూడా తనా పని చెయ్యడమా?

'ఏం రాశాడమ్మా?' అన్నది దుర్గమణి కొసకు-

ఒక ప్రక్కకు వత్తిగిలి పడుకొన్నది కాస్తా-'ఆఁ. ఏమీ రాయ లేదమ్మా! ఇక్కడకు రావడం అంత మంచిది కాదుట-అంతకన్న మరేమీ లేదు!' అన్నది.

ఆ ఉత్తరంలో ఉన్న విషయ మిదేనని తెలిసిన తరువాత, దుర్గమణి కళ్లు నీటితో నిండి పోయాయి. 'రావడం అంత మంచిది కాదు,' ఈ

వాక్యాన్ని పదే పదే మననం చేసుకొని, అతులుడు సర్వనాశనం కావా అని శాపనార్థాలు పెట్టింది.

ఈ చిన్ని ఉత్తరంలో, ఎంతటి ఆత్మాభిమానం, మరెంతటి తీవ్ర వ్యథ దాగొని ఉన్నదో తెలీదు. ఇక్కడికి కొచ్చిన తరువాతనే జ్ఞానద జ్వర పడ్డది. ఇలాంటి అవాంతరా న్ని స్తాయని ముందుగా ఊహించే, అతులుడు వీరి ప్రయాణాన్ని ఆపడానికి కనీసం—చివరిసారి మాటడాని కొచ్చానని వారితో అన్నాడు. ఆ మాట నిజమే!

'నేను స్వయంగా ఎక్కడికి కెళ్ళినా, ఏం చేసినా, ఏమైనా ఇబ్బంది లేదు. కానీ పిల్లను వెంట బెట్టుకొని ఇక్కడకు రావడంమాత్రం బొత్తిగా కూడని పని. ఎన్ని బాధ లొచ్చినా సరే-అక్కడే ఉన్నట్లయితే బాగుండేది. కాని తనా పని చెయ్యలేదు. సమయం మించి పోయింది. ఇప్పుడెన్ననుకొన్నా ప్రయోజన మేమిటి?' అనుకొన్నది దుర్గమణి.

ఆవేశంలో అతులుణ్ణి శపించినా, అతను రాసిన ఉత్తరం ఇంకా ఆమె చేతుల్లోనే ఉన్నది. ఆ ఉత్తరం అతులుని గాలూరు ఎన్నో విష యాలను స్మరింప జేస్తున్నది. భర్త మృత్యువుతో పోరాడుతున్నప్పుడు, అతులుడు చేసిన శపథము, తీర్థయాత్రానంతరం, ప్రసాద మిచ్చే నెపంతో, గాజులు పట్టుకు రావడము, హరిపాలెం ప్రయాణమైన నాడు, చేసిన హం గామా, ఆమె మనో నేత్రం ముందు పారాడాయి. కలకత్తా నుండి, పని మాలా అతనెందు కొచ్చిందీ, అందరికీ తెలిసి పోయింది. 'ఈ పిల్ల నల్లగా ఉన్నదన్న మాటే గానీ, ఈ నలుపు రంగుకున్న విలువేమిటో ఆయనగారు చూస్తే ఎంత బావుండును! కోయిల నలుపుగా ఉంటుంది. భ్రమరంగూడా నలుపుగానే ఉంటుంది. కాబట్టి—?' అనుకొన్నది దుర్గమణి తనలో తాను.

'జ్ఞానదా! ఒంట్లో ఎలా ఉందమ్మా?' అన్నది పైకి.

'నాకేం? బాగానే ఉన్నాను!'

'అమ్మాడూ! ఆ ఉత్తరంలో అతులుడు నన్ను గురించి ఏమన్నా రాశాడా అమ్మా?'

'నువ్వే చదువు. తెలుస్తుంది.'

ఎంతో ఉత్సాహంతో దుర్గమణి ఆ కాగితాన్ని తీసుకొని కిటికీ దాపు కెళ్ళింది. ఇంత పెద్ద కాగితం మీద అతులుడు వ్రాసింది రెండే రెండు పంక్తులా? ఇది నిజం కాక పోవచ్చు. ఒక కాగితానికి బదులు—జ్ఞానద పొరబాటున మరో కాగితం ఇచ్చి ఉండ కూడదా? అలా పొరబడే అవకాశం కూడా ఉన్నది కదా! అయినా చూస్తే పోయిందేమిటి గనక! అనుకొన్నది దుర్గమణి. కాగితం విప్పింది. మొదటి చరణం 'శ్రీచరణ సన్నిధికి' అని ఉండటం చూసి తనలో తనే నవ్వు కొన్నది. అయితే ఈ ఉత్తరం జ్ఞానదకు రాయలేదు. అతులుడు తన నుద్దేశించే రాశాడు. 'హరిపాలెం మలేరియాకు పుట్టినిల్లని నాకు ముందుగానే తెలుసు. ఆ విషయమే ఆనాడు మీకు చెప్పాను...జ్ఞానద జ్వరంతో బాధపడుతున్నదని తెలిసి చాలా విచారిస్తున్నాను. ఆమె త్వరలోనే ఆరోగ్య వంతురాలు కాగలదని ఆశిస్తున్నాను. ఇక్కడ మేమందరమూ క్షేమంగా ఉన్నాము. నా వందనా లందుకోండి...'

జ్ఞానదకు ఏమని రాసి ఉంటాడు? ఇది తనకు రాసిందని స్పష్టపడి పోయింది. జ్ఞానదకు ప్రత్యేకంగా మరో లేఖ రాసి ఉంటాడు. ఆ ఉత్తరాన్ని గురించి అడగాలని నోటిదాకా వచ్చి నిగ్రహించుకొన్నది దుర్గమణి. కానీ ఉండ లేక అడిగేసింది!

'అమ్మా!' అన్నది దుర్గమణి, జడలు కట్టుకు పోయిన జ్ఞానద కేశాలను చిక్కు దీస్తూ. 'అతులుడు నీకు రాసిన ఉత్తరంలో—నిన్ను గురించి కొప్పడుతూ ఏమన్నా రాశాడుటే?'

జ్ఞానద విస్తుపోయింది.

'ఇంకో ఉత్తర మేమిటీ? ఆ రాసిందేదో నీ పేరే రాశాడుగా అమ్మా!' అన్నది.

'పిచ్చి తల్లీ!' అని గారాబం చేసింది దుర్గమణి. 'నేనా ఉత్తరాన్ని చూడను, చూపమనికూడా నిన్నడగను. కేవలం ఆ ఉత్తరంలోని సంగతులు చెబితే చాలు. సంతోషిస్తాను.'

'అయ్యో! నన్ను నమ్మవేమిటే అమ్మా! నాకలాంటి ఉత్తరాలేమీ రాయలేదు. రాసిన ఆ వొక్కటీ నువ్వు చూడనే చూశావు.' అని ఓ ప్రక్కకు తిరిగి పడుకొన్నది.

'అలాగా!' అని ఆశ్చర్యపడ్డది దుర్గమణి. 'వ్రాయడానికి రెండు పంక్తుల కన్న విషయాలే లేక పోయాయా అతగాడికి!'

జ్ఞానద చింపిరి జుట్టులో చిక్కుకు పోయిన ఆమె వ్రేళ్లు, ఏదో అనుమానంతో వణికాయి. అలా స్తబ్ధుగా చాలాసేపు కూచుని, ఒక్కసారి చివాలున లేచి, గబ గబా వెళ్లి పోయింది.

ఇలా గడుస్తున్నాయి రోజులు.

## 5

మార్గశిర మాసపు ప్రథమ దినాలు. శీతల వాయువులు, చురుకుగా వీస్తున్నాయి. వాతావరణం చల్లబడ్డది. జ్ఞానదకు కొంత నెమ్మదిగా ఉన్నది. పూర్తి ఆరోగ్యం చేకూరక పోయినా, మునుపున్నంత జ్వర తీవ్రత ఇప్పుడు లేదు. తన చిన్ననాటి స్నేహితురాలు, అత్తవారింటి నించి వచ్చిందని, దుర్గమణికి తెలిసింది. ఆవిడను తను చూసి గూడా చాలాకాలమయింది. కూతురుకు, ఎటుగూడీ రవంత స్వస్థత చిక్కింది గనుక, పాత స్నేహితురాలిని చూసి రావాలనుకొని, బయలు దేరిందామె. త్రోవలో పోస్టు బంట్రోతు కనిపించాడు.

'ఏమయ్యా దాసూ! నా ఉత్తరాలు సరిగ్గా నాకందడం లేదు. కారణ మేమిటి?' అనడిగింది దుర్గమణి.

'నీ కసలు ఉత్తరాలే రాక పోతే, నేనెక్కణ్ణించి రప్పించగలనక్కాయ్?' అన్నాడు దాసు.

'పోనీ నాకు రాలేదు అనుకో! నీ మేనగోడలు, జ్ఞానద పేరుతో ఉత్తరాలు రావడం లేదా?'

'లేదక్కాయ్!'

'నాయనా! మేము మూడుత్తరాలు రాశాం. ఒక్క దానికీ జవాబు లేదు. అతులుడు జవాబివ్వకుండా అంతే ఊరుకోడు. పోనీ మునిగి పోయిందేమీ లేదు గదా-ఒక్కసారి నీ సంచి దులిపి చూడు-ఏ మూలనన్నా, నా ఉత్తరాలు చిక్కుకొనున్నా యేమో తెలుస్తుంది!'

ఇక మాటలు పెంచడం అనవసర మనిపించింది దాసుకు.

'లేదండీ అక్కయ్యగారూ! నేనలాంటి పొరబాటు పనులుచేయను. ఉత్తరం మీకు రావడమంటూ జరిగితే, తక్షణం రెక్కలు గట్టుకొని మీ గుమ్మం ముందు వాలతాను. ఈ సరికి నన్ను పోనివ్వండి' అన్నాడు దాసు, పోబోతూ.

పోతున్న దాసును ఆపి దుర్గమణి ఇలా అన్నది:

'అవున్నాయనా! నువ్వలాంటి వాడివని నాకు తెలుసు. అయినా పొరబడి ఉండవచ్చు గదా! ఇక్కడి పోస్టు మేష్టరు గారికి, నా పేరుగాని నా కూతురు పేరుగానీ తెలియదాయె! ఒకవేళ నాకు ఉత్తరాలొచ్చినా, ఈ పేరుగల మనిషి, ఈ ఊళ్ళోనే లేదని, ఎక్కడో పారేసి ఉండవచ్చు. నేనంటే, ఊరివారికి తెలుసుగానీ, పోస్టు మాష్టారికేం తెలుసూ? అందుకని—పోస్టాఫీసు కెళ్ళి, నేనే స్వయంగా, వెదుక్కుందామను కొంటున్నాను. అలా చేయడానికి వీలున్నదా దాసూ?'

ఆమెగారి ఆతురత, ఉత్తరం కోసం పడే వ్యాకులపాటూ చూస్తే దాసుకు జాలివేసింది.

'ఎందుకు వెదుక్కోగూడ దక్కయ్యా? కానీ, నువ్వాపని చేయడం అనవసరమే! మేమే వాటి నన్నింటినీ జాగర్తగా...సరే! నీ మాట నెందుకు కాదనాలి. ఒకవేళ పొరబాటున ఎక్కడన్నా పడిపోయాయేమో? ఆనక వెళ్ళినప్పుడు మళ్ళా ఓసారి జాగర్తగా వెతుకుతాను. దొరికితే వెంటనే తెచ్చిస్తాను. మరి నేను వెళ్ళి రానా?'

అని—ఆమె సమాధానానికి ఎదురు చూడకుండానే వెళ్ళిపోయాడు.

'తల్లీ! జగజ్జననీ! భవానీ మాతా!! అతులుని వద్ద నుండి ఉత్తరం వచ్చేలా చెయ్యి తల్లీ!'

దుర్గమణి మ్రొక్కుకొని సాగారింది. జ్ఞానద, ఇలాంటి ఇరకాటంలో వున్నట్లు తెలిసీగూడా, అతులుడు ఒక్క ఉత్తరం ముక్క రాయడా? అసంభవం!!

మనుష్యుల ఆశలకు, ఆశయాలకు, విశ్వాసాలకు పరిమితులులేవు. నిత్యపరిణామశీలమైన మానవజీవితాన్ని అర్థం చేసుకోవడం - కొందరను కొంటున్నట్లు సులభంకూడా కాదు. ఒకనాడు, ఏవో పరిస్థితుల ప్రాబల్యం

చేత, మనిషి-ఒకమాట అన్నంత మాత్రాన, కలకాలం దానినే అంటి పెట్టుకొని ఉండమనడము, ఉంటాడనుకోవడమూ కూడనిపని. దుర్గమణి, ఇప్పుడలాంటి అనుచిత కార్యమే చేసింది! ఇటీవల చెప్పుకోదగిన ఎన్నో పరిణామాలు అతులునిలో కొచ్చాయని ఆమెకు తెలియదు.

దుర్గమణి, తన చిన్ననాటి స్నేహితురాలిని కలుసుకొన్నది గానీ, ఎక్కువ సేపు ఆమెతో గడపలేక పోయింది. అతులుడు వ్రాసినలేఖను - దాసు వెదికి తెచ్చి ఉంటాడన్న సంగతి, ఆమెను స్థిమితంగా కూర్చో నివ్వలేదు. ఆదరాబాదరా ఇంటికొచ్చి-

'జ్ఞానదా! దాసు, నీకేమన్నా ఉత్తరం తెచ్చిచ్చాడటే!' అన్నది దుర్గమణి.

'లేదు.'

'కాగులే అమ్మా! దాసునన్ను పిలిచే ఉంటాడు! నువ్వు నిద్ర పోతున్నావేమో, నీకా కేక వినిపించి ఉండదు. ఎవ్వరూ పలక్క పోవడం చేత, అతను తిరిగి వెళ్లిపోయాడు!...అదిగాదు జ్ఞానదా! నేను ఇంట్లో లేనప్పుడు-కాస్తమేలుకొని కూచోగూడ దటే! ఏంకొంప ముంచు కెళ్లిందని నిద్రపోవాలి సొచ్చిందే?'

దుర్గమణి ముఖం మాడ్చుకొన్నది.

తల్లి ఇన్నిమాట్లాడినా జ్ఞానద సమాధాన మివ్వలేదు. తాను నిద్ర పోలేదనీ, ఆకారణంతో పోస్టు బంట్రోతు పిలిచినా పలక్క పోవడం జరిగి ఉండదనీ ఆమె చెప్పలేదు. ప్రతినిత్యమూ దుర్గమణి-మరోవిషయమే లేనట్లు, ఆసంగతిని గురించే, ప్రస్తావిస్తుండేది. జ్ఞానదకూడ విసుక్కోకుండా, అదే సమాధానం తిరిగి తిరిగి చెబుతుండేది.

ఉత్తరమనేదే రానిపక్షంలో, వెదికి ఇస్తానని దాసు ఎందుకు అంటాడు? తనతో పరిహాసంగా అన్నాడని సరిపెట్టుకోవాలనుకొన్నా, అతనలాంటివాడు కాదని తనకు తెలుసాయె. మరి అనమ్మకం ఆమె కెందుకు కలిగిందో కాని, ఆనాడు విధిగా అతులుడు ఉత్తరంవ్రాసి ఉంటాడని ఆమె గట్టిగా విశ్వసించింది. కూతురు చెప్పిన సమాధానం ఆమెకు బొత్తిగా నచ్చలేదు. మేనల్లుణ్ని పోస్టాఫీసుకు పంపి, విషయం కనుక్కొన్న దాకా, ఆమెగారి ఆత్మ, శాంతిని పొందలేదు.

నాలుగైదు రోజుల దాకా, అతులుని ఉత్తరంకోసం దుర్గమణి ఎదురు తెన్నులు చూచింది. ఎంతో ఆత్రుతపడ్డది. కానీ అలాంటి ఉత్తరమేమీ ఆమె కందలేదు. కొండెత్తు ఎగిగిన ఆమె ఆశల రాసులు, కూలిపోయాయి. ఒకరోజున తనే అతనికి ఉత్తరం వ్రాసింది. ఆలస్యంలేకుండా ఆ ఉత్తరానికి జవాబు వచ్చింది. ఆ ప్రత్యుత్తర పురేఖలో పెద్దవిశేషమేమీ లేదు. అతులుడు కలకత్తాలో ఉన్నాడట. అంతా క్షేమంగానే ఉన్నారనీ, చదువు సంధ్యలు చక్కగా కొనసాగుతున్నాయనీ, ఉన్నది.

మార్గశిరం గడిచింది. పుష్యమాసం వచ్చింది. అయినా అతులుని నుండి జాబు రాలేదు. మాఘమాసంగూడా గడిచిపోయింది. ఉత్తరమయితే రాలేదుగానీ, జ్ఞానదజ్వరంనుండి విముక్తిని పొందింది. ఈసంతోషం ఎక్కువ కాలం దక్కలేదు. జ్ఞానదకు విడాకు లిచ్చిన, ఆరోగభూతం, దుర్గమణిని వరించింది. అసలే దిగులుతో బాధపడుతున్న ఆమె ఆరోగ్యం మరింత శిధిలముకాసాగింది. అదీగాక-ఇదికూడా-భామినిపట్ల ఆమెకు సదభిప్రాయం లేదు సరిగదా, రోజురోజుకూ తీవ్రంగా ద్వేషించ నారంభించింది. భామిని ప్రసక్తివచ్చినప్పుడల్లా, ఆమె పేరుకు మారుగా 'తాటకి' అన్నవిశేషణాన్ని ఉపయోగించ సాగింది దుర్గమణి. భామినిమీద ఈర్ష్యాద్వేషాల లాగే, రోజులుగూడా త్వరితగమనాన్ని అందుకొన్నాయి.

జ్ఞానదను అత్యంతానురాగంతో 'తాటకి' చూడటానికి కారణం, జ్ఞానద అందంగా ఉంటుందనీ; ఈ ప్రేమ, అనురాగం, వాత్సల్యాదులు, చూపడానికి ముఖ్యకారణం, భామినికున్న స్వార్థచింతనతప్ప మరేమీ కాదనీ, దుర్గమణి మనస్ఫూర్తిగా విశ్వసించింది. ఈమనో వేదనకు తోడు, పాపిష్ఠివ్యాధొకటి దాపురించింది. దుర్గమణి ఈతాకిడికి తట్టుకో లేక పోయింది. మంచాన పడ్డది.

'అమ్మా!' అన్నది జ్ఞానద ఒకనాడు. 'ఇంకా ఇక్కడే ఉండటం నాకు భావ్యంగా లేదమ్మా! ఇంటికిపోదాం పద! జరిగేదేమిటో, అక్కడే జరుగుతుంది!'

ఈసలహా దుర్గమణికి బాగా నచ్చింది. మరొకప్పుడైతే, అవిడ ఒప్పుకొనక పోను. భామిని రోజురోజుకూ, తనకూతురపట్ల ప్రదర్శిస్తున్న శ్రద్ధాసక్తులు, ఆమె నీ ఇంటినుండి త్వరగా వెళ్ళడానికి నిశ్చయించుకునేట్లు చేశాయి.

దుర్గమణి స్వగ్రామం వెళ్ళేందుకు ప్రయాణ సన్నాహాలలో ఉన్నదని శంభు చటర్జీగారికి తెలిసింది. ఆయన భగ్గునమండి పడ్డాడు. సావుకోళ్లు తాటించుకొంటూ వచ్చి, 'దుర్గా!' అని బిగ్గరగా కేక వేశాడు.

దుర్గమణి అప్పుడే లేచి, అరుగుమీది స్తంభాని కానుకొని, ముఖం కడుక్కొంటూ ఉన్నది. జ్ఞానద తల్లికి సాయపడుతూ ఉంది. అన్నగారి పిలుపు విని, సమాధానం ఇవ్వలేకేమో-అటు వేపు ముఖం తిప్పి చూసిందామె.

'నువ్వింత నీరసంగా ఉన్నావు గదా-అదీగాక-సరే-అయినా నువ్విప్పుడు ఇల్లు వదిలి వెళ్ళకూడదు.'

'ఎందుకని అన్నయ్యా?' అన్నది దుర్గమణి.

'ఎందుకనా! ఎందుకనో నీకు తెలియదటే దుర్గా? లేకపోతే నానోటి మీదుగా ఇంకోసారి చెప్పించాలనుకొంటున్నావా?'

'నిజంగానే తెలియదన్నయ్యా?'

'నేనొకమాట యిచ్చాను. అది తప్పడానికి వీలులేదు. మాటను పోగొట్టుకొని, అబద్ధీకుణ్ణి కావడం నాకిష్టంలేదు. నాబొందిలో ప్రాణముండగా, అలాంటిది జరగడానికి వీలుపడదు. తెలిసిందా?'

అన్నాడేగానీ, దుర్గమణికి తెలియనేలేదు. ఐతే తను తెలుసుకోవలసిందేమిటి? దేన్నిగురించి తను తెలుసుకోవాలి? అసలు సంగతేమిటో చెప్పకుండా, కేకలేస్తే ఎలా? ఆసంగతే అన్నగారితో అన్నది దుర్గమణి.

'అసలు సంగతేమిటని మళ్లీ అడుగుతావేమిటే దుర్గా? ఆమాత్రం నీకు తెలియదా? ఈ ఎదొచ్చిన పిల్లను, గుండెలమీద కుంపటిలా పెట్టుకొంటివి. దానికేదో విధంగా, పెళ్లిచేయక తప్పదుగదా! దాని తండ్రి ఉంటే, నాకీబాధ లేకపోను. ఖర్మగాలి బావగారు కాలంచేశారు. ఇక నాకు తప్పుతుందామరి? ఇంతకన్నా మేనమామను నేనుండిగూడా, జ్ఞానద ఇంకా అవివాహితురాలుగా ఉన్నదంటే నాకెంత చిన్నతనంగా ఉంటుందో నువ్వాలోచించవేమిటే దుర్గా! అందుకే నేను నానా బాధలూ పడి, ఫాల్గుణ పంచమినాడు లగ్నం పెట్టుకొన్నాను. మన నవీనునికిచ్చి చేసేస్తే, నీబాధా తీరుతుంది; నాకానించకుండానూ ఉంటుంది. ఇటువంటి

బ్రహ్మాండమైన సంబంధం. అన్నప్పుడల్లా సిద్ధించదు. తెలిసిందిలే దుర్గా?' అన్నాడు శంభు.

దుర్గమణి కుప్పకూలిపోయింది.

'నాతో మాట మాత్రమన్నా అనకుండా, నువ్వు అగ్నిమెందుకు స్థిరపరిచావన్నయ్యా? ఏది ఏమైనాసరే-నేనీ పెళ్ళి జరగనివ్వను. జరగడానికి వీల్లేదు!' అన్నది దుర్గమణి ఏడుస్తూ.

'నువ్వు బ్రతికుండగా చెయ్యనివ్వకపోవచ్చు. కానీ నీతదనంతరం గూడా, చెయ్యకుండా ఆపగలవా? నీకోసమని నేను మాట తప్పినవాణ్ణి కానా? అదెప్పటికీ జరగదు. నేనయినా పరాయివాణ్ణి కాదు. పిల్లకు స్వయానా మేనమామను. దానికి పెళ్ళిచేసే హక్కు నీకేకాదు - నాకూ ఉన్నది. నీఏడుపు చూసి-నేను నాప్రయత్నాన్ని విరమించను.' అన్నాడు శంభు.

'నేనూ ప్రాణంతో ఉండగా, ఈపెళ్ళి జగరనీను. నాకోసం నువ్వు అబద్ధీకుడివి కానవసరం లేదు.'

దుర్గమణి కంఠం దుఃఖంతో గాద్గదిక మయింది.

శంభు కోతిలా గంతు లేశాడు.

'దుర్గా! ఏదైతే నువ్వు జరగదంటున్నావో, దాన్ని నేనుచేసి తీరతాను. నాపట్టుదల నీకు తెలియనిది కాదు!'

అంత దాకా పిడకలుచేస్తున్న భామిని-చేతులు కడుక్కోకుండానే అక్కడికొచ్చి అన్నది:

'ఇంతకూ, ఆ వరమహాశయు లెవరో తెలియ పరుస్తారా?'

ఆ ఆకారంచూసి శంభు చకితుడైనాడు. అయినా భయపడినట్టు ఎక్కడా కనపడనీయకుండా అన్నాడు:—

'ఎవరైతే నీకెందుకే! నీ ఏడుపును వ్వేడుము కోరాదూ?'

భామిని పేడచేతుల్ని విచిత్రంగా తిప్పుతూ అన్నది: 'మీరు మేనమామలా? మీ మేనమామతనాన్ని మాపడానికింతకంటే సమయం దొరకలేదా? మీరిక్వ్వదలిన వందరూపాయల బాకీని రద్దు పరుచుకోనేం దుర్గాను-నవీనుడికిచ్చి-ఈపసిగాయ గొంతుకోస్తా రన్నమాట. అందుకనేహా

స్వామీ ఉత్తమవరుడు-ఇలాంటి గొప్పసంబంధం అంతంత మాత్రపు వారికి దొరకదని గప్పాలు కొడుతున్నది! వాడెవడో తెలియకపోతే, నేనూ మీమాటలు నమ్మి ఉందును. వాడు నాకు స్వయానా అన్నగారాయె! వాడి సంగతి నాదగ్గర చెప్పబోతారేం?.. అని పరేగానీ, వాడునీకెలా ఉత్తము డనిపించాడండీ? అయిదుగురు బిడ్డలతల్లిని, ఎనిమిది నెలలగర్భిణితో ఉన్నదాన్ని, కల్లుగంజాయిలు సేవించి, మన్నూ మిన్నూ గానక, కడుపు మీదతన్ని చంపాడని మీకు తెలుసుగదా! ఆరాక్షసపు వెధవకు పిల్లనెట్లా యిస్తావయ్యా? వాడు నీకు ఉత్తమ వరుడా? అంతంత మాత్రపు వాళ్ల కిలాంటి సంబంధం దొరకదని అబద్ధా లాడుతావా? పద-ఈసంగతి నలుగురికీ చెబుదాం. బంగారంలాంటిపిల్ల బ్రతుకును బండలు చెయ్య బోవడం గాకపోతే, ఇది మంచిపనేనా?' అని నాలుగు వడ్డించింది భామిని.

శంభు ఇక కోపాన్ని ఉంచబట్టలేక పోయాడు. ఒక వేపున తోబుట్టువున్నది. ఇంకో వేపున మేనగోడలున్నది. తన రహస్యమంతా వారిద్దరి ముందూ బట్టబయలయిపోతున్నది. జారిపోతున్న పరువును కాపాడుకొందా మను కొన్నాడేమో, కాలిపావకోడు తీసి, 'నోర్ముయ్ ఛడవా ముండా! పెదిమ కదిపావంటే చీల్చేస్తాను' అన్నాడు.

అయినా 'తాటకి' ఊరుకో లేదు.

'ఏమిటీ? నేను ఛడవా ముండనా? వళ్ళు కాస్త దగ్గిరుంచుకొని మాట్లాడు. ఇంకోసారిలా పేలావంటే, కొరివినోట్లో దోపుతా జాగ్రత్త... ఆం... నేనిది మాటవరస కనడంకాదు. పంచుకూతుర్నే అయితే, అన్నంత పనీచేస్తాను... ఈపిల్లను నువ్వు బలవంతంగా పెళ్ళిచేస్తావుటయ్యా? అలా చేయడానికి-అసలు నువ్వెవడివి? నీకేం హక్కుంది? ఏదో అన్నగారు గదా, పదిరోజుల పాటు సుఖంగా ఉందామని, అవిడొస్తే, గెయ్యింబగట్టా ఒకటేపోరు పెడుతుంటివి. ఏమిటీ దిక్కుమాలిన సాధింపులూ నువ్వూనూ!' అని దులిపేసింది భామిని.

ఆఘాటికి శంభు తట్టుకోలేక పోయాడు. గబగబా గా లోపలకు వెళ్ళి పోయాడు.

భామిని వదినగారి వేపు తిరిగి అన్నది:

'వదినా! ఆయనమాట లక్ష్యపెట్టకు. ఆయన మనిషి కాడు. ఛండాలుని కంటే హీనుడు. మీరీ ఇంట్లోకి అడుగు పెట్టినప్పణ్నించీ ప్లాను వేస్తున్నాడు. ఈరత్నం లాంటి పిల్లను, ఆతుచ్ఛుడికిచ్చి, ఋణవిముక్తుణ్ణౌదామనీ, తాకట్టుకింద ఉన్న భూమిని విడిపించుకొందామనీ ఆశపడుతున్నాడనుకొంటాను. వట్టిలుచ్ఛాబుద్ధి వదినా నీ అన్నయ్యది. అంతదాకా ఎందుకమ్మా! నిన్నమొన్నటి దాకా, జ్ఞానద పుట్టెడు రోగంతో తీసుకొన్నదా: డాక్టర్ని పిలవమంటే, నాదగ్గర చిల్లికానీ లేదన్నాడు. చివరికి నా వెండి కడియాలు తాకట్టుబెట్టి, మందిప్పించాను. కాస్త లేచి తిరిగిందో లేదో, పాత భజన సాగించాడు. రోగ మెస్తేనయం చేయడానికేమో తను మేనమామ కాదు. పెళ్ళిచేయడానికి మాత్రం మేనమామట. ఈ మాట చెప్పుకోడాని గ్గాడా సిగ్గుపడడోనా? నేను బ్రతికున్నంత కాలమూ, జ్ఞానద కేలోటూ రానీను. మీరు ఇంటికి వెళ్ళండి. ఆ దేవర్ని చేసుకొంటానంటే వాడికిచ్చి ముడిబెట్టండి. దాని ప్రాణమున్నా సుఖపడుతుంది. ఈగొడవలన్నీ అయ్యాక, ఒసారి ఇక్కడకు రండి వదినా! మీయిష్టమొచ్చినంతకాలం ఉండవచ్చు.'

భామిని ప్రవర్తన దుర్గమణి ఊహించలేనిది. ఈ అనూహ్య వర్తనకు ఆమె విస్తుపోయింది.

భామిని తనలో తను అనుకొంటున్నట్టు మెల్లగా అంది.

'అనాథలమీద దౌర్జన్యం చేస్తే-జగన్నాథుడు పైన లేడా? ఇలాంటి దుర్మార్గుల్ని ఆయనమాత్రం క్షమిస్తాడా?' అన్నది భర్తనుద్దేశించి.

ప్రయాణ సన్నాహం పూర్తయింది. దుర్గమణి, బండెక్క బోయే ముందు భామిని కాళ్ళమీద, కన్నీళ్ళతో పడ్డది.

'వదినా! నువ్వు నిజంగా దేవతవు సుమా! నిన్ను ఆశీర్వదించడానికి నేను తగను. అయినా నిన్ను సర్వవేళలా కాపాడుతుండమని, దేవుణ్ని వేడుకొంటున్నాను. ఇదివరకు నిన్ను గురించి చాలా అపోహాలు పడ్డాను. నన్ను క్షమించు. నా బిడ్డకోసం—నువ్విలాంటి త్యాగం చెయ్యగలవని నేననుకో లేదు.' అన్నది దుర్గమణి.

జ్ఞానద సంతృప్తికరంగా నవ్వింది.

'ఆఁ ఇదీ ఒక త్యాగమేనా వదినా? నాగాజుల్లూ, కుంకుమా, కల కాలం ఉండేలా ఆశీర్వదించు. నాకదే చాలు...సరే! పడిలేచిన మనిషివి, అలా ఎక్కువసేపు నిలబడకు. వెళ్లి బండిలో కూచో...ఏమే జ్ఞానదా! నీ అత్తమామల ఇంట్లో నువ్వు చాలా బాధలుపడ్డావు. అవన్నీ-నాకోసం అయినా మరిచిపో తల్లీ! ఎప్పుడయినా ఈ పాపిష్టిదాన్ని చూడటానికి రా, నన్ను మరిచిపోకు,' అని జ్ఞానద చేతిలో రెండు రూపాయలు పెట్టింది.

బండి సాగారింది.

దుర్గమణి కన్నీరు రాపుకొంటూ, 'తెలిసీ తెలియక నిన్నెంతో కష్ట పెట్టాను వదినా! అవేమీ మనస్సులో ఉంచుకోకు. నన్ను మన్నించు' అన్నది.

'మేమే మిమ్మల్ని కష్టపెట్టాం వదినా!' అన్నది భామిని కన్నీరు తుడుచుకొంటూ.'జ్ఞానదా! పనసలు, మామిళ్లు, కాయలు కాసే నాటికి, మీ ఆయనతోసహా నువ్వు మాయింటికి రావాలి.ఆనక పిలవలేదనుకోకు.ముందు గానే చెబుతున్నాను. మరిచిపోవద్దు' అని తిరిగీ కళ్ళద్దుకొన్నది.

తాము తిరిగివస్తున్నట్టు అనాథనాథుడికి వ్రాయ నవసరం లేదను కొనే, దుర్గమణి తన స్వగ్రామం వచ్చింది. వాకిట్లోనే స్వర్ణమంజరి తారస పడ్డది. ఆమెగారు జ్ఞానదను చూస్తూనే నావ్వాపుకోలేక పోయింది.

'ఏమే జ్ఞానదా! ఏంజరిగిందిమిటి? ఎవడే నీబుగ్గలిలా సాగదీశాడు? ముఖం ఇట్లా చెడిపోయిం దెంగుకనే! సీహో! వెంట్రుకలుగూడా రాలి పోయ్యాయే!' అని ఆశ్చర్యం నటించి, ఈవినోదాన్ని చెల్లెలికి చూపాలన్న కుతూహలంతో అన్నది. 'దేవరాణీ! ఓ దేవరాణీ! త్వరగా-ఒక్కసారి ఇలారా! జ్ఞానద వచ్చింది. చూద్దువుగాని రా.'

నర్మగర్భితమైన ఈమాటలు జ్ఞానద మనస్సును కించ పరిచాయి. అయినా ఆమె మాట్లాడ లేదు. ఇంతలోకే దేవరాణి వచ్చింది. జ్ఞానద చప్పున లేచి పినతల్లికి ప్రణామం చేసింది.

'జ్ఞానదా!' అన్నది దేవరాణి, జ్ఞానద ఆకారాన్ని చూసి చింతిస్తూ, 'ఇలా అయిపోయా వేమిటమ్మా?'

'వెనుకరు గుబుర్లతో ఉండే, తెల్లనయ్యేంలా వుంది జ్ఞానద. రాత్రిళ్లు

చూశావో, దడుచుకు చచ్చామనుకున్నామా కే!' అన్నది స్వర్ణమంజరి పకపక నవ్వుతూ.

కృశించి, శిథిలమయిపోయిన అవయవాలనూ, పాలిపోయిన శరీరాన్నీ చూసి దేవరాణి మాతృహృదయం, విచలితమయింది. ఆ కారణానే, ఆవిడ స్వర్ణమంజరి 'వినోదకార్యక్రమం'లో భాగస్వామిని కాలేకపోయింది.

దేవరాణి ఆరోగ్యం జ్ఞానదపసరసనే కూర్చున్నది. తలను నిమిరింది. ముఖాన్నీ, వంటినీ, ఆప్యాయంగా స్పృశించింది. జ్ఞానద తను జబ్బుపడిన విషయం పినతల్లికి చెప్పుకొన్నది.

'అలాగా జ్ఞానదా!' అన్నది దేవరాణి. 'అయితే అప్పుడే ఎందుకు రాలేదమ్మా? ఇక్కడికి రావద్దని, మిమ్మెవ్వరూ అనలేదుగదా! అది సరే గానీ, అక్కయ్యేదీ?'

'అమ్మ బండిలోనే జ్వరపడ్డది పిన్నీ! రాగానే ఇంట్లో పడుకోబెట్టి వచ్చాను.'

'ఆహా! నేననుకొంటూనే ఉన్నా, ఇలాంటిదేదో జరుగుతుందని. నేనీ ఇంటికి పెద్దకోడల్నిగదా! నన్ను కాదని పుట్టింటికి వెడితే ఏమీ జరక్కుండా ఎలా ఉంటుందీ!'

ఈ రకమైన ధోరణిని దేవరాణి కూడా సహించలేక పోయింది.

'అక్కాయ్! రెండేళ్ళపాటు, ఏదన్నా పుణ్యవ్రతంచేస్తే, ఈ జన్మలో గాకపోయినా, వచ్చే జన్మలోనయినా, నీ నోరు కాస్త బాగు పడుతుంది. దయచేసి నువ్వాపని చెయ్యక్కాయ్!' అన్నది దేవరాణి, దుర్గమణిని చూడాలన్న ఉద్దేశంతో లేచి.

స్వర్ణమంజరి దిమ్మెరపోయింది. తననుగురించి దేవరాణి ఇలా అంటుందని ఆమె కలలోగూడా అనుకోలేదు. అలాంటి దీనాడు సంభవించింది.

'సరే మంచిదే నమ్మా చెల్లీ! చాలా మంచిది. ఇన్నిరోజులగ్గాను నీకు రెండో కోడలు కనిపించిందన్న మాట.. నే నింకా ఏమో అనుకొన్నాను...అమ్మవో య్! ఎంత మాయలాడివే నువ్వు దేవరాణీ!'

చిన్నకోడలు సమాధాన మివ్వలేదు. జ్ఞానద చెయ్యిపుచ్చుకొని, దుర్గమణి ఇంటికేసి నడిచింది. తన పినతల్లి నడవడికను చూసి జ్ఞానద ముందుగా ఆశ్చర్యపోయింది. ఆ తరువాత భయపడింది.

హరిపాలెంలో ఉన్న పరిస్థితి వేరు. ఇక్కడి పరిస్థితి వేరు. అక్కడుండగా జ్వరం తగిలితే, దిగజారిందాకా పడుకో నేది దుర్గమణి. ఆతరువాత యధాప్రకారం పూజా పునస్కారాలలో మునిగిపోయేది. ఇక్కడ అలా జరిగే అవకాశం లేకపోయింది. ఆమె పడుతున్న కష్టాలకు సానుభూతిని చూపేందుకొచ్చిన ఆడవాళ్ళు, నాలుగైదురోజులు తిరక్కుండానే, ఆమెను చాపమీదకు చేరేట్లు చేశారు.

ఒకనాడు నీలకంఠ ముఖర్జీగారి భార్య, దుర్గమణిని పరామర్శించడానికొచ్చి, ప్రసంగవశాత్తూ అన్నది:

'అదిగాదే దుర్గా! ఇంకెంత కాలమని, దానికి పెళ్లీ పేటాకులూ లేకుండా ఉంచుతావే' ఎవరిముఖమూ చాడడానికి వీల్లేని ఈడుకూడా వచ్చింది గదా! ఇంకెన్నిరోజులలా ఉంచుతావమ్మా!'

'అత్తయ్యా! ఇంకా సంబంధమెక్కడా కుదరలేదమ్మా! మరి ఆ భగవంతుడు దానికి ఆరాత ఎప్పుడు రాశాడో మనం చెప్పలేం గదా!'అన్నది దుర్గమణి అలసిన కన్నులు మూసుకుంటూ.

'అదిగాదే దుర్గా! ఆసంగతి నాకు మాత్రం తెలియదూ? మనం పదిచోట్లా తిరిగి ప్రయత్నించాలి గానీ, భగవంతుడు మనమ్మాయికి మొగుణ్ణి వెదుక్కొచ్చి పెడతాడా?'

దుర్గమణి మాట్లాడలేదు. అయినా ఆ శ్రేయోభిలాషిణి మాత్రం ఊరుకో లేదు.

'నువ్వు పుట్టింటికెళ్ళావుగా! అక్కడ మీఅన్నగారు, ఏసంబంధాన్నీ చూడలా?' అన్నది.

'ఏమో, ఆభగవంతుడికి తెలియాలి!' అన్నది దుర్గమణి ప్రక్కకు వత్తిగిలి.

గంట గడిచింది. ఆ హితకాంక్షిణి మళ్ళీవచ్చి, 'వంట్లో ఎలాఉంది దుర్గా?' అన్నది.

'జ్వర మింకా తగ్గలేదత్తయ్యా! అలానే ఉంది!' అన్నది జ్ఞానద, తల్లి మంచానికొక వేపున కూచుని.

గొంతువిని,గుర్తించి దుర్గమణి ఇటుకేసి తిరిగి, 'రా, కూర్చోవదినా!' అన్నది.

'కూచోడం కాదమ్మా! చాలా ఆలస్యమయింది. తొందరగా ఇంటి కెళ్ళాలి ..ఒక చిన్న సంగతి చెబుదామని వచ్చాను. ఏమిటంటే-ఇదివరకు లాగా, ఇప్పుడుగూడా పిల్లదాని పెళ్ళివిషయం సాచేత చెయ్యబోకు. ఎవరినో ఒకరిని పట్టుకొని, ఆ మొుక్కు కాస్తా తీరిం దనిపించుకో. ఇదివరకు కాస్తవంటి రంగన్నా మెరుగ్గా ఉండేది. ఈజ్వరపడ్డ తరువాత, మరీ మారి లాగా తయారయింది. తొందరపడకపోతే లాభం లేదు...ఏమే కోడలా! నెత్తిమీది వెంట్రుకలు గూడా ఊడిపోయ్యాయేమే!'

జ్ఞానద తల వంచుకొన్నది.

అయినా ఆముహోతల్లి ఊరుకో లేదు.

'అబజారున ఉండే గోపాల్ భట్టాచార్యుడు మళ్ళీ పెళ్ళిచేసుకోనే ప్రయత్నాల్లో ఉన్నట్టు విన్నాను. మీమరిది నొకసారి పంపించి, సంగతి సందర్భాలేమిటో తెలుసుకోగూడదా ఏం?' అన్నది.

'సరే, అలాగే మరిదిగారితో చెబుతాను వదినా!' అన్నది గుర్గమణి నిట్టూర్చి.

ఇలాంటి సలహాలూ రోజూ ఎన్నో వినవలసి వచ్చేది. కానీ ఎవరికోసం ఆమె కళ్ళు ఎదురు చూస్తున్నాయో, అతని దర్శనం మాత్రం ఈనాటికీ కాలేదు. అసలుడు రాలేదు సరే-కనీసం అతని తల్లిగారయినా ఇటు కేసి తొంగి చూడలేదు.

వరాణిలో అనురాగానికీ, కారుణ్యానికి లోపం లేదు. అయితే ఆవిడ ఉత్సాహమరిపోను. పైగా ఇప్పుడు గర్భవతిగూడానూ. ఈ కారణా అన్నిటి వల్లా, ఇప్పుడామె ఇంటి పనిముట్టుకోనైనా ముట్టుకోవడం లేదు. భారమంతా స్వర్ణమంజరి మొయ్యవలసి వస్తున్నది. ఆసమయంలో-ఒక నాడు స్వర్ణమంజరి, జ్ఞానదను పిలిచి ఇలా అన్నది:

'జ్ఞానదా! రోగం రోగమని ఎప్పుడూ మూలపడుకొంటే, పను లెట్లా అవుతా యనుకొన్నావే! మీ అమ్మ గూడా ఇప్పుడు పనిచేసే స్థితిలో లేదు. నువ్వు కావడానికి పెద్దదానివే అయ్యావు గానీ, ఏం లాభం? సరే—అదలా ఉంచు. మీ చిన్నాన్న గారికి ఉదయమే భోజనం వండిపెట్టగలవా?' అన్నది.

ఈ మాటలన్నీ దేవరాణి విన్నది. చాలా అన్యాయం జరిగిపోతున్న దని ఆమె మనస్సు వ్యథనందింది. అయితే, దాని నామె ప్రకటించ లేదు. ఎదటివారు బాధపడుతూంటే దేవరాణి చూడలేనిమాట నిజమేగానీ, ఆ బాధను తొలగించాలన్న ప్రయత్నం మట్టుకు చేయదు. ఆ శక్తీ, తాహతూ ఆమెకు లేవు.

'ఆ...అలానే వండుతాను పెద్దమ్మా!' అన్నది జ్ఞానద.

ఇంకా ప్రతిరోజూ, రాత్రిళ్ళు జ్ఞానదకు జ్వరం తగులుతూనే ఉన్నది. తన కింకా జ్వర మొస్తుందని ఆమె తల్లికి చెప్పలేదు. చెప్పి నందువల్ల, ఆమె మనస్సు మరింత బాధపడడం కన్న ఫలిత మేమీలేదు గదా! ప్రాతఃకాలాన్నే తనశుష్కదేహాన్ని ప్రయత్న పూర్వకంగా, ప్రక్కమీదినుండి లేపి, పనిలోకి ప్రవేశపెట్టేది జ్ఞానద. అదెంతో బాధా కరంగా ఉండే దామెకు. అయినా పెత్తల్లి కావిషయం తెలియ నిచ్చేది కాదు. అసంతృప్తిని ప్రకటించేదీ కాదు.

ఒక్కగా నొక్క బిడ్డ కావడంతో, ఎంతో గారాబంగా పెరిగింది. చాలా జాగ్రత్తగా పోషించ బడిం దామె. చిన్నతనం నుండీ, పెద్దల పట్లా, గురువుల పట్లా గౌరవభావ మేర్పరచు కొన్నది. ఎవరెన్ని విధాల మాట్లాడినా, శాంతంతో సహించే గుణం అలవడింది. కానీ ఈ నాడు—ఇంతటి గుర్బల స్థితిలో ఉండి కూడా, బోలెడంత శ్రమ భారాన్ని మోస్తూ, అణగారి పోతున్నదన్న సంగతి ఎవ్వరూ గుర్తించలేదు. గుర్తించిన దేవరాణి సానుభూతి చూపగలదేగానీ, ఏ విధంగానూ సాయపడ లేదు. ఇలాంటి విషమస్థితిని కలిగించి నందుకుగాను, స్వర్ణమంజరిమీద ద్వేష భావాన్ని పెంచుకొన్నదే తప్ప, పల్లెత్తి ఆమె నొక్కమాట అనలేక పోయింది దేవరాణి.

ఆ తెల్లవారి అనాథనాథుడు స్నానం చేసి లోపలి కెళ్ళాడు. లోపలి కెళ్ళడం జ్ఞానదచూసి, పళ్ళెం నిండా అన్నం తోడుకొని, ఆయ నకు వడ్డిద్దామని పోబోతోంది. స్వర్ణమంజరి ఎలా చూసిందో, చూసి, కేకలేసుకొంటూ పరుగెత్తు కొచ్చింది.

'ఎక్కడికే జ్ఞానదా పోతున్నావ్?' అన్నదామె.

'చిన్నాన్న స్నానం చేసి వచ్చారు పెద్దమ్మా!'

'అయితే నువ్వేం చెయ్యాలని పోతున్నావే?' అన్నది స్వర్ణమంజరి ముఖం కండలూడ చెరుకొంటూ. 'అన్నం తోడుకొని, మరిది ముందు కెళ్లొద్దని నీతో చెప్పానా లేదా అమ్మా? నీకు బుద్ధి లేదుటే? నువ్వు వడ్డిస్తే మగవారికి పనికొస్తుందా? ఆమాత్రం జ్ఞానంలేక పోయిందా?-అని'

'ఏం జరిగిందక్కయ్యా?' అన్నది దేవరాణి ఈ కేకలకు గదిలో నుండి బైటికొచ్చి.

స్వర్ణమంజరి తోడికోడలి ప్రశ్నకు సమాధాన మివ్వకుండా, జ్ఞానద వేపే చూస్తూ అన్నది:

'అసలు నీ అభిప్రాయ మేమిటే జ్ఞానదా? నేను చెప్పిన పని చెయ్యకూడదన్న నియమం పెట్టుకొన్నావా? లేకపోతే, నేను వద్దన్న పనే నువ్వెందుకు చేశావో నాకు తెలియడం లేదు... కాకపోతే, వడ్డించిన పళ్లెం పుచ్చుకొని ఆయన గారి ఎదటికెడితే, మెచ్చి మేక తోలు కప్పుతాడనీ, ఓ మహారాజకుమారుణ్ణి తెచ్చి కట్టబెడతాడనీ అనుకొన్నావా? నీ అభిప్రాయ మదే అయి ఉంటుందిలే! అయ్య బాబోయ్! వేలెడు గుంటవు లేవే—అప్పుడే నీకెన్ని ఆలోచనలు పెట్టాడే భగవంతుడు! అందుకే మనరాతలు అలా తగలబడ్డాయి ..!' అని చప్పున పళ్లెం లాక్కొని గబగబా వెళ్ళిపోయిందామె.

అసలే ఆవటిల్లుతూ ఉన్న ర్గమణి మనస్సును ఈ సంఘటన మరింత కలచి వేసింది.

'ఛీ— ముదనష్టపు దానా! కొస్త పెద్దవారి మాటలు వినవే! ఎందుకు నా ప్రాణం తీస్తావ్!'

జ్ఞానద నిశ్శబ్దంగా వంటింటి కేసి వెళ్లిపోయింది.

స్వర్ణమంజరి ధారాప్రవాహాన్ని ఆపగల శక్తి చిన్నకోడలకే ఉన్నది. పెద్దక్కగారి స్వభావం ఆమె గారికి తెలుసు. అయితే నోరు చేసుకొనే ఓపిక లేదు. జ్ఞానద ఇంట్లోకి రాగానే, దేవరాణి ఆమెదగ్గరి కొచ్చి లాలిస్తూ అడిగింది: 'జ్ఞానదా! పెద్దమ్మ మాటలు ఎందుకని వినవమ్మా?'

జ్ఞానద కొన్ని క్షణాలు పినతల్లి ముఖంలోకి చూసి, పొర్లుకొస్తున్న కన్నీటి నాపుకొంటూ, ఆమె పాదాల మీద పడ్డది.

'పిన్నీ! భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. నామాట నమ్ము బాబాయికి అలా పళ్లెంలో అన్నం పెట్టి తీసుకెళ్ళ కూడదని, నాకెవ్వరూ చెప్పలేదు. చెప్పినా, చేయడానికి నేనంత మూర్ఖురాలినా పిన్నీ?'

నిరపరాధియైన జ్ఞానద హృదయాన్ని, ఎలా ఉల్లాస భరితం చేయాలో తెలియక, ఆమె కన్నీటి నద్దుతూ, అలానే కూచుండి పోయింది దేవరాణి.

## 6

దుర్గమణి ఆరోగ్యం శిథిలమయి పోయింది. ఆమె శరీరం కృశించి, అస్థిపంజరంలా తయారయింది. మరొకరి చేయూత లేనిదే, లేవలేనంత దుర్బలత్వ మేర్పడ్డది. ఆ పరిస్థితుల్లో కూడా, ఒక్క జ్ఞానద తప్ప, ఆమెకు సేవా శుశ్రూషలు చేసే వారెవ్వరూ లేక పోయారు. బండెడు ఇంటి చాకిరీతో బాటు, ఈ భారాన్ని కూడా జ్ఞానద మోస్తూనే ఉన్నది. ఏదో ఒక సమయంలో, రవంత వెసులుబాటు చూసుకొని, జ్ఞానద తల్లి దగ్గరికొచ్చి పోతుండేది. అలాగే ఈ రోజునా వచ్చి, తల్లి వీపు నిమురుతూ కూచున్నది. కొన్ని నిమిషాలు గడిచాయి. అత్యంత పరిచయమైన కంఠ ధ్వని ఆమెకు వినిపించింది. ఆమె హృదయం ఉద్వేగవంతమూ, ఆవేశ పూరితమూ అయింది.

హోలీ పండుగ సెలవుల్లో ఇక్కడికి వచ్చాడు అతులుడు. అతని వెంబడి ఇరుగు పొరుగు స్నేహితులు నలుగు రైదుగురు నిలబడి ఉన్నారు. అందరి దుస్తులకూ రంగులంటుకున్నాయి. అతులుడు, జేబుల నిండా రంగులు నింపుకొని వచ్చి, 'అత్తయ్యా!' అని బిగ్గరిగా పిలిచాడు.

జబ్బుతో ఉండడం మూలాన్ని దుర్గమణి—ఎప్పుడో కాస్తంత కునుకు దీయడం తప్ప-నిద్ర పోవడమనేదే లేదు. ఇప్పుడూ అలాంటికునుకు తీస్తుందేమోనని, జ్ఞానద భిడియ పడ్డది. ఎవరి రాక కోసం తల్లి అహర్నిశలూ ఎదురు చూసిందో, ఇంకా చూస్తున్నదో, ఆ అతులుడు ఇక్కడికి రాలేదు. తన పెదతల్లి గారింట్లో మసలుతున్నాడు. ఈ చర్య ఊరికే పోదు, తల్లిని తీవ్రాతి తీవ్రంగా గాయపరుస్తుంది. ఆమెలో ఏమూలనో దాగొన్న ఆశను సమయింపజేసి, ఈర్ష్యానలాన్ని జ్వలింప చేస్తుంది. అతు

లుణ్ణి చూడంగానే, ఆప్యాయతతో ఆహ్వానించడానికి బదులు, తల్లి కయ్యానికి కాలు దువ్వగలదని, జ్ఞానద అంతరాత్మ ఘోషిస్తున్నది.

ఏదో విధంగా ఈ బెడదను వదల్చాలనుకొన్నది జ్ఞానద. ఎందుకైనా మంచిదని తలుపుకు గడియ వేసేందుకు, బరువైన కాళ్ళను ఈడ్చుకొంటూ లేచి, గడియవేస్తున్నప్పుడే, దుర్గమణి పసిగట్టి అడిగింది:

'అమ్మా! ఆ మాట్లాడేది అతఁడే గదూ?'

'ఏమో నమ్మా!' అన్నది జ్ఞానద వెనుదిరిగివస్తూ. 'నాకూ సరిగ్గా తెలియదు.'

'ఆయనేనమ్మా!...ఓ...అతనే! అయినా వెళ్ళి - ఒకసారి చూసి రా తల్లీ!'

ఎదురు జవాబిస్తే తల్లి మండిపడుతుందని జ్ఞానదకు తెలుసు. అందుకే మాట్లాడకుండా లేచివెళ్ళి, మెల్లిగా తొంగి చూసింది. అతనెక్కడా కనిపించ లేదు. దూరంగా ఉన్న వసారాలోనించి, మరికొందరి గొంతుకలతో కలిసి అతులుని కంఠం కూడా వినిపిస్తున్నది. ఆ కొద్ది చిహ్నమే చాలనుకొని వెనుదిరగ బోయింది జ్ఞానద! కానీ అలా తిరగలేక పోయిందామె. ఒక్కసారి - ఒకే ఒక్కసారి, అతన్ని చూడాలన్న వాంఛ ప్రబలంగా పెల్లుబికి, మరో అడుగు ముందుకేసిం దామె. అతులుడొక స్తంభం వెనుక నిలబడి, పిడికిళ్ళ నిండా ఉన్న రంగును స్వర్ణమంజరి పాదాలపై విదిపి పగలబడి నవ్వుతున్న దృశ్యం కనిపించిం దామెకు.

పోదామనుకొంటూనే చాలాసేపు, అక్కడే నిలబడింది. తను అనుకొన్నంతా అయింది. దుర్గమణి లేచి, తూలుకొంటూ ఇటువేపే వస్తున్నది. జ్ఞానద చప్పున పరుగెత్తి కెళ్ళి తల్లిని, పొదివి పట్టుకొని అన్నది:

'ఇదేమిటమ్మా! నువ్విలా లేచిం దెందుకే? పద. పడుకొందువు గాని రామ్మా!'

'ఏం? ఎందుకని?' అన్నది దుర్గమణి కళ్ళెర్ర జేసి.

'నేనేమీ సమాధానం చెప్పలేనమ్మా! కానీ ముందు నువ్విక్కడ నుండి వెనక్కి పద...వారివల్ల మనకే ఉపకారమూ జరగదు.'

'నన్ను వొదులు...ఊఁ...నన్నొదిలి పెట్టవే ముందు!'

జ్ఞానద తల్లిని ఆపలేక పోయింది. అమానుషబలం తల్లి కున్నట్లు ఆ క్షణాన ఆమె గ్రహించింది. రివ్వు రివ్వున ముందుకు దూసుకెళుతున్న తల్లిని, ఛాయలా అనుసరించడం కన్న మరేమీ చెయ్యలేక పోయింది. అందరూ అటు కేసి చూశారు. దేవరాణి కూడా అక్కడికి కొచ్చింది.

జాజ్వల్యంగా భాసిస్తున్న దుర్గమణి కళ్ళల్లోకి చూడలేక, అతులుడు, చూపులతో బాటు ముఖం కూడా దించేశాడు.

'అతుల్ బాబూ!' అన్నది దుర్గమణి కసిగా, 'నీకు మేము ఏ అపకారం చేసినందుకు, మమ్మిలా సర్వ నాశనం చేశావ్ నాయనా?'

అతులుడు మౌనంగా ఉన్నాడు.

అతనికి బదులు స్వర్ణమంజరి ప్రత్యుత్తరించింది. 'ఏమిటే? నిన్ను సర్వనాశనం చేశాడా? ఎలాగో కాస్త వివరించు చెల్లీ?'

'నేను నీకు సమాధానం చెప్పనక్కర్లేదక్కా! నువ్వీ విషయమై నన్నడక్కు. నేను ప్రశ్నించింది, అతులుణ్ని. సమాధానం చెప్పవలసింది అతను గానీ, నువ్వు కాదు.'

'నేనంత గడ్డితినే మనిషిని కాదులే దుర్గా! ఎందుకలా అనవసరంగా నోరు పారేసుకుంటావ్? నా కూతుర్ని పెళ్ళాడతానని, నీతో ఖరారు చేసుకొన్నాడా యేం? వెళ్ళమ్మా! వెళ్ళు వెళ్లు. పండగ గదా, కాస్త సంతోషంగా ఈ రోజు గడుపుదామని అతులుడు మా యింటికొచ్చాడు. ఇక్కడకొచ్చి నువ్వనవసరంగా గొడవ చెయ్యకు, బావుండదు.' అన్నది స్వర్ణమంజరి.

'నేనిక్కడకు గొడవ చెయ్యడానికి రాలేదక్కా!' అన్నది దుర్గమణి అతుల్ బాబు వేపు తిరుగుతూ. 'నాయనా! ఈ సంవత్సర కాలం మేమేలా గడిపామో, నువ్వూహించలేవు. మేము పడ్డ యాతనలు, మాకు తెలుసు. ఆ జగద్రక్షకునికి తెలుసు.. అయినా, నువ్వలాంటి ఆశ మాకెందుకు కలిగించావు నాయనా? నా వల్ల కాదని, అందరి లాగా, నువ్వూ మెదలకుండా ఊరుకొంటే తీరిపోయేది గదా? అలా ఎందుకు చేశావు గాను అతుల్?'

స్వర్ణమంజరి మనస్సు చివుక్కు మన్నది.

'నువ్వు నా అతుల్‌ను ఇలా అల్లరి పెట్టకు దుర్గా! మేము బ్రతికున్నంత కాలమూ, అతులుడు స్వతంత్రించి ఏ పని చెయ్యడానికీ వీలు లేదు. అర్థమయిందా?'

దుర్గమణి, పది మందిలో ఇలా దెప్పేయడమూ, స్వర్ణమంజరి తన పక్షం వహించడమూ, అతులునికి సమాధాన మిచ్చే అవకాశాన్ని కలగజేశాయి.

'నా అంతట నేను, ఆ మాట అనలేదు. చుట్టూ బోలెడంతమంది జనమున్నారు. ఉన్నారన్న సిగ్గు కూడా లేకుండా, జ్ఞానద నా కాళ్ళమీద బడి, మొత్తుకోవడం సాగించిందాయె! ఇంక నేనేం చేయను? ఎలా ఈ ఈ పీడ వదిలించుకోను భగవంతుడా, అనిపించింది. 'మీ నాన్న దగ్గర చెబుతాలే' అన్నాను. చెప్పాను కూడా ననుకో. అంత మాత్రాన మీకు నేను బుద్ధిపడి ఉన్నట్లు లెక్కా ఏమిటి? ఆ సమయంలో, జ్ఞానద గొడవ వదిలించుకోనేందుకు, అంతకంటే మరో మార్గమేమీ కనిపించక, అలా అన్నాను గానీ, నిజంగా చేసుకోందామని కానే కాదు...బాగానే ఉంది మేళం! మీరా మాటే పట్టుకొని పాకులాడుతున్నారా ఏం?' అన్నాడు అతులుడు.

'ఏమిట్రా అతులా?' అన్నది స్వర్ణమంజరి సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బు లవుతూ. 'జ్ఞానద నీ కాళ్ళమీద పడి పెళ్ళి చేసుకోమన్నదా?'

'నా మాట మీద నీ కంత నమ్మకం లేక పోతే, ఆమెనే అడుగు పెద్దత్తయ్యా! ఎందులోనైనా దూకి, చావనన్నా చస్తాను గానీ, ఈ కోరివిని నేను చేసుకొంటానా అత్తా?'

అక్కడున్న వారందరూ ఫకాలు మని నవ్వారు.

దుర్గమణికి పిచ్చెత్తి నట్లయింది.

'ఓరి కృతఘ్నుడా!' అన్నదామె ఓగ్గరిగా అగుస్తూ. 'చావాలని నీకుంటే అలాగే చావు. నీలాంటి కృతఘ్నులు బ్రతికి ఉండడం కూడా అనవసరమే! ఇంత మంది ముంగ, నువ్వు జ్ఞానదను మాటన్నానని సంతోషించబోకు! నువ్వు మృత్యు ముఖంలో ఉన్నప్పుడు, ఆ కోరివే నీకు అడ్డమైన చాకిరి చేసి, ప్రాణాలు నిలబెట్టిన సంగతి, ఇంతలోనే మరిచిపోతే

ఎలా? అయినా, నా పిచ్చి గాక పోతే, నీకీ సంగతులన్నీ ఎలా గుర్తుంటాయి నాయనా?'

దేవరాణికి అంతా అయోమయంగా ఉంది.

స్వర్ణ మంజరి ఈ ఎత్తి పొడుపులు విని భరించలేక, పోరాటానికి సిద్ధపడింది.

'అయితే చెల్లెమ్మగారూ! తమ నిజ స్వరూపం ఇదన్న మాట! బావుంది...తమ తెలివి తేటలకు సంతోషించాం గానీ, ముందు నా ఇంట్లో నించి దయ చెయ్యండి ..ఊఁ ..కదులు...తక్షణం వెళ్లి పో.' అన్నది స్వర్ణమంజరి.

జ్ఞానద నిర్విణ్ణ అయింది. ఆమెలో, సిగ్గు భిడియాలు, అభిమానావమానాలు తిరస్కారాలు లేనీ లేవు చైతన్య రాహిత్యమై, చేష్టలుడిగి, అలా రాతి బొమ్మలా, నిలబడి పోయింది. అలాంటి జడ స్థితిలో జ్ఞానద ఉండడాన్ని దేవరాణి అంతకు ముందెప్పుడూ చూడలేదు. ఆమె కెంనుకో భయ మేసింది. జ్ఞానదను కుదుపుతూ పేరు బెట్టి పిలిచింది.

'ఏమిటి పిన్నీ?' అన్నది జ్ఞానద చాలా సేపటికి.

'ఇంకా ఇక్కడే ఎందుకమ్మా నిలబడి ఉండటం? మీ అమ్మమ్మను లోపలకు తీసుకెళ్ళ రాదూ?'

'అమ్మా! లోపలి కెడదాం రావే!' అంటూ తల్లి చేయిపట్టుకొని, లోపలకు తీసుకెళ్ళింది జ్ఞానద.

'దేవరాణీ!' అన్నది స్వర్ణమంజరి చిన్న తోడికోడలు వేపుకు తిరుగుతూ. 'దీనికెంత ఆశ పుట్టిందో చూశావా? చందమామ కోసం చేతులు చాపడ మంటే ఇదే ననుకొంటాను.'

'చిన్నత్తయ్యా! ఎలాంటి పని జరిగిందో చూశావా?' అన్నాడు అతులుడు నవ్వడానికి ప్రయత్నిస్తూ.

'ఇంత వయస్సులోనే ఇలాంటి సాహసపని ఆశ్చర్యమా! గాదు రాదు! కాలం పాడయి పోయింది!' అన్నది స్వర్ణమంజరి ఖంగుమని నవ్వి.

'నిజంగా కాలం పాడయి పోయింది అతుల్ బాబూ!' అన్నది దేవరాణి అదోలా నవ్వుతూ! 'నిజంగా ఇది సత్యయుగమైతే, భూదేవి, ఈపాటికి సిగ్గుతో నుగ్గు నుగ్గయి ఉండేది!'

ఈ మాటలని ఆమె లోపలి కెళ్ళి పోయింది.

ఆ మాటలలోని వ్యంగ్య ధోరణిని స్వర్ణమంజరి తెలుసుకోలేక 'నేనూ అదే గదా అన్నది' అని తన తెలివికి తనే ఉబ్బిపోయింది.

అసె సమయాన అతులుని ముఖం మ్లానంగా మాడి పోయింది. దేవ రాణి విసరిన వ్యంగ్య బాణాలను స్వర్ణమంజరి గుర్తించ లేదు గానీ, అతు లుడు గమనించాడు. అతని మనస్సు తీవ్రంగా గాయపడ్డది. అక్కడ ఉండ లేక వెళ్ళి పోదామని, లేచి, తచ్చాడాడు.

ఇంత వరకూ అసలు విషయం కప్పబడే ఉన్నది. అనాధ నాధుని పెద్ద కూతురు మాధురికీ, అతులునికీ పెళ్ళి స్థిరపడినట్లే నన్న ధృవ పడని వార్తలు, ఇరుగు పొరుగుల నుండి దుర్గమణి విన్నది. ఆ విషయాన్నే స్వర్ణ మంజరి ఇప్పుడు పునరుద్ఘాటించింది.

అతులుడు ప్రక్కకు చూశాడు. మాధురి దర్శన మిచ్చింది. ఆ పిల్ల వేపు చూస్తుంటే, అతనికెంతో సంతోష మేసింది.

## 7

మాధురి తన బాల్యాన్ని, కలకత్తాలోని మామగారింట గడిపి వేసింది. మహాకాళి పాఠశాల విద్యార్థినిగా ఉండి, వంగ, సంస్కృతాంగ్లాలను చదువు కొంటున్నది. పాటలు బాగా పాడుతుంది. శివాజీ మందిరంలో కూచుని, స్తోత్ర పారాయణ చెయ్యడం గూడా ఆ పిల్లకు తెలుసు. వీటన్నిటికీ తోడు మాధురి మాంఛి చూపరి. దుర్గాదేవి పూజ నిమిత్తమై, రెండు నెలల పాటు కలకత్తా వదిలి, పుట్టింట ఉండవలసి వచ్చింది. అప్పుడే పెళ్ళిని స్థిర పరిచారు. వరాన్వేషణ చేయవలసిన అవసరం లేదు. ఆ పెళ్ళి కొడుకే వెదుక్కుంటూ వీరి వద్ద కొచ్చాడు. వీటన్నిటినీ సంకలనం చేసేందుకు, గంగాభాగీరథీ సమానురాలు స్వర్ణమంజరి ఉండనే ఉన్నదాయె.

దేవరాణి అన్నగారు బాగా కలవాడు. ఆమె తల్లిగూడా ఇంకా జీవించి ఉన్నది. దేవరాణి ప్రసవించే రోజులు సమీపంలోనే ఉండడం మూలాన్ని ఆమెగారు ఉండి పోయింది. మాధురి వచ్చీ రావడంతోనే పెత్తల్లికి నమస్కరించింది.

'చిరంజీవిగా వర్థిల్లు తల్లీ!' అని దీవించింది దుర్గమణి.

మాధురి ముఖంలోకి సాలోచనగా చూసిందామె. వస్తుతః మాధురి అందమైనది. దానికి తోడు మేనమామ, బాగా అలంకరించాడు కూడా. అత్తగారు, బస్తీ మనిషి కావడంతో, అలంకారాలలోని లగువు బిగువు లన్నీ తెలుసుకొని, తదను గుణంగానే అలంకరించింది. వంటి మీద అట్టే నగలు లేవు. అయినా ఆ లోపం కనిపించదు! అలా కాస్సేపు చూసి దుర్గమణి అన్నది:

'ఆహా! ఈ పిల్ల నిజంగా పుత్తడి బొమ్మ!'

ఆ వెంటనే కాళ్ళ వద్ద కూచున్న జ్ఞానదను చూసింది. ఆమె కళ్ళు భగ్గున మండాయి.

'ఆఁ నేనూ కన్నానో 'అందాల రాణి'ని. ఏం లాభం? గబ్బిలం ముఖం, కాటిక రంగు ఇదీనూ-' అన్నది దుర్గమణి ఓ ప్రక్కకు వత్తిగిల్లి పడుకొంటూ.

జ్ఞానదకూడా మాధురిని చూసింది. అపురూపమైన ఆమె సౌందర్యం, కన్నులు జిగేలు మనిపించే, సిల్కు గుడ్డలు, ఆమె మనస్సును చూరగొన్నాయి. తన దరిద్రపు వేషంతో, మాధురిని పోల్చుకొని, సిగ్గు పడ్డది.

'అక్కాయ్!' అన్నది మాధురి, జ్ఞానద దగ్గర కొచ్చి. 'కాస్సేపు ఆడుకొందాం, రా అక్కాయ్'

జ్ఞానద ఏం సమాధానం చెప్పిందో తెలియదు. మాధురి అన్నమాట దుర్గమణి విన్నది. చివుక్కున ఇటుకేసి తిరిగి కూతురుతో అన్నది:

'నీ దరిద్రపు ముఖాన్ని బైటి వారిగ్గూడా చూపించకు. నువ్విక్కడే ఉంటే బావుంటుంది. ఎక్కడికీ కదల బోకు'

జ్ఞానద ఏమీ మాట్లాడ లేదు. మాధురి కాస్సేపు జ్ఞానద వస్తుందేమోనని చూసి, వెళ్ళి పోయింది. దుర్గమణి, తనలో రేగుతున్న ఈర్ష్యా సూయా జ్వాలలకు తట్టుకోలేక పోయింది. గొడ్డులా మూలగ సాగింది.

'అమ్మా!' అన్నది జ్ఞానద, 'తల నొప్పిగా ఉందేమో కాస్తంత వత్తేదా?'

'వద్దు.'

'అది గాదమ్మా! కాస్సేపు...'

'అవసరం లేదు...అసలు నువ్వు నా మంచం మీద నుంచి లేచి పో సంకరపు ముండా! నిన్ను చూస్తుంటే, నా కెక్కడా లేని మంట పుట్టు కొస్తున్నది! ఊఁ పోవే ముండ.'

కూతురును, ఒక్క తన్ను తన్నింది దుర్గమణి.

ప్రతి దానికీ ఓ హద్దంటూ ఉండటం సహజమని నమ్మితే, జ్ఞానద ఓర్పుకు గూడా ఒక హద్దు ఉండటం సహజమే కాగలదు. ఆ పిల్ల ఎన్నో అవమానాలను సహించింది. ఎందరో, ఎన్నో విధాల, కాని మాటలంటున్నా, కిమ్మనక, తలవొంచి భరించింది. దారుణమైన అత్యాచారాలను, ఓరిమితో, సహించింది. అవమానాల భారం, మోపెడవుతున్న కొద్దికీ, వంగిపోసాగింది. అది గూడా పూర్తయింది. ఇక ఆమె వంగిపోవడానికి స్థలమంటూ లేదు. అందుకే నేలమీద పడుకొని, చేతుల్లో ముఖం దాచుకొని దుఃఖించింది.

'భగవంతుడా! అందరి కళ్ళకు నేనెందుకూ పనికిరానిదానిలా కనిపిస్తున్నాను. నేనేం తప్పు చేశాను? అందంగా లేకపోవడం నా తప్పా? నగ నాణ్యాలు లేకపోవడం, నా అపరాధమా? నాకు తండ్రి లేడు. అందం లేదు. ఆభరణాలు లేవు. సరయిన తిండి లేదు. మంచిగుడ్డలు లేవు. ఇవన్నీ నాతప్పు లెలా అవుతాయి స్వామీ? వ్యాధితో కృశించి పోయిన ఈ నా శరీరం ఏమగవాణ్నీ ఆకర్షించలేక పోయింది. ఈ ఆపత్సమయంలో ఆదుకొనే వారు గూడా నాకు లేరు. నన్ను పెళ్ళాడి, ఈ ఘోరబాధలనుండి, విముక్తి కలిగించే పురుషుడీ వంగదేశంలో కరువైనాడు. తండ్రీ! నేనిక్కడ ఉండలేను. నన్ను గూడా మా నాన్నగారి వద్దకే చేర్చు. ఆయనగారి మనస్సింకా, నా పట్ల ఆర్ద్రంగానే ఉంటుంది. నన్నాయన ఆదరించి, చేరదీస్తాడు. భగవంతుడా! వెంటనే నాకు చావును ప్రసాదించు!'

జ్ఞానద తనలో భగవంతుణ్ని ప్రార్థించింది; ఏడుస్తూ.

'జ్ఞానదా!' అన్నది దుర్గమణి కూతురు వేపుకు తిరిగి.

జ్ఞానద కళ్ళు తుడుచుకొని లేచి నిలబడ్డది.

'అసలే నీరసంగా ఉన్నావు గదా! నేలమీద పడుకొన్నా వెందుకమ్మా?' అని లేచి కూచున్నది దుర్గమణి.

కూతురు అనేకసార్లు ఉన్నట్లే, ఇప్పుడూ మౌనంగా ఉన్నది.

'నిన్ను తన్నాను కదూ తల్లీ! పాపిష్ఠి ముండను.—' దుఃఖాన్ని ఆపుకోలేక, కూతురును గాఢాలింగనం చేసుకొన్నది దుర్గమణి.

# 8

ఒకనాటి సాయంకాలం అనాథనాథుడు, హడావుడిగా దుర్గమణి గదిలోకొచ్చి ఇలా అన్నాడు:

'నీ ఆరోగ్యం ఎలా ఉన్నదండీ వదినగారూ? అహా... లేవకు. ఫరవా లేదు. అలా పడుకో వదినా!...మందు మాత్రలు పుచ్చుకోవడం లేదని విన్నాను. ఇలా అయితే, రోగాలెలా నయమవుతాయి వదినా?'

దుర్గమణి ఇటీవల మందు త్రాగడం మానేసింది. త్రాగి, ఇంకొంత కాలం పాటు జీవించాలన్న ఇచ్ఛ ఆమె కిటీవల నశించి పోయింది. మందు ఇచ్చినా, ఇవ్వక పోయినా, ఆమె కొచ్చే సుదీర్ఘమైన ఈ రోగం, ఎప్పుడో తనను ఆకస్మికంగా మింగి వేస్తుందన్న నమ్మకం ఆమె ఏర్పరచుకొన్నది.

ఆమె పరిస్థితి రోజు రోజుకూ ప్రమాదకరంగా పరిణమించ సాగింది. కంఠస్వరం సన్నగిల్లింది. చెవులో నోరుబెట్టి మాట్లాడక పోయినా, చాలా దగ్గరకొచ్చి చెప్పకపోతే, మాటలు వినపడవు. ఇలాంటి స్థితిలో గూడా మరిది వచ్చి, ఆప్యాయత కనబరిచి, పలకరించడంలో, ఏదో కుట్ర ఉండి తీరుతుందనే దుర్గమణి విశ్వసించింది. ఆమె ఏదో జవాబు చెప్పింది. హీనస్వరం పడడం మూలాన్ని, వదినగారు చెప్పిందేమిటో అనాథనాథుడికి వినపడ లేదు. అందుకోసం ఎంతో ప్రయత్నం చేయవలసి వచ్చింది. విన్న తరువాత అతడిలా అన్నాడు:

'నువ్వన్నమాట నిజమే వదినా! భర్త పోయాక బ్రతికుండి లాభం లేదన్న మాటను నేనూ ఒప్పుకొంటాను. భారతదేశంలో పుట్టిన ప్రతివాడూ, ఈ విషయాన్ని తరిచి తరిచి, పిండి పారేశాడు. అయినా, ఇలా మృత్యువును కోరి తెచ్చుకోవడం మంచిది కాదు వదినా! పోయిన నీ భర్తను ధ్యానించడం సరే! పిల్లను ఒక యింటిదాన్ని చేయవలసిన బాధ్యత గూడా ఉంది మరి. జ్ఞానదకు వివాహాన్ని గురించి, నే నెన్ని ప్రయత్నాలు

చేస్తున్నానో నీకు తెలుసు గదా! ఇందుకోసమని, అయిదారు గ్రామాలు గూడా తిరిగొచ్చాను. ఏమీ లాభం లేకపోయింది. ప్రతివారూ పిల్లను చూసి భయపడుతున్నారు వదినా! ఇక నేనేం చేయను చెప్పు.'

దుర్గమణి ఏమీ మాట్లాడ లేదు.

అనాధనాధుడే మళ్ళీ అన్నాడు:

'చిన్నన్న కాలం చేసినప్పట్నుంచీ, నువ్వు నా దగ్గరే ఉంటు న్నావు గదా! సంసారమన్న తరువాత మాట పట్టింపులు రాక పోవు. కస్సు బుస్సు మను కోవడం గూడా తప్పదు. నీలకంఠ ముఖర్జీగాణ్ణి నువ్వెరుగుదువుగా! ప్రతి ఇంటికీ తిరిగి ఈసంగతి చెప్పి, గ్రామాన్ని కట్టు కట్టిస్తున్నాడు. మీ తల్లీ బిడ్డల వల్ల నేను ఊళ్ళో ఉండలేక పోతు న్నాను వదినా! అయినా—వాళ్లేవళ్ళో అంటున్నారని కాదు గానీ— మనకు మాత్రం తెలియడం లేదా? పట్టణాల్లో అయితే, ఇలాంటి దిక్కు- మాలిన పట్టింపులు పట్టించుకొనే సాధుడే ఉండడు. ఎక్క- డెక్కడి అడ్డాల కట్టుబాట్లు ఈ పల్లె కొంపల్లోనే తలెత్తు తుంటాయి.'

దీర్ఘంగా నిట్టూర్చాడు అనాధనాధ్.

ఇలా చెప్పుకు పోతున్న మరిదికి, ఇవ్వదగ్గ సమాధానమైతే ఉంది కానీ, ఆమె మనస్సు మరొకదాని వేపు మళ్ళడం మూలాన, అతని లోకి వెర్రి దానిలా చూసింది.

అనాధనాధుడు ఓసారి దగ్గి, ఎవరన్నా ఉన్నారేమోనని అటూ ఇటూ చూసి మెల్లిగా అన్నాడు:

'వదినా! నువ్వెక్కడికైనా కదలాలన్నా కదలలేని స్థితిలో ఉన్నావు గనక, నీకేవిషయమూ చెప్పడం లేదు. ఇప్పుడు మాధురికిగూడా యుక్తవయస్సు వచ్చింది. నేను దాని పెళ్ళి విషయం గూడా ఆలో చించాలి. రోజులా—బాగుండలేదు. మనకు బాగా తెలిసిన జాగా చూసి, జ్ఞానద నక్కడకు పంపితే అన్ని విధాలా బావుంటుంది. ఈ యింట్లో జ్ఞానద ఉండదు. ఉండకూడదు. ఆమెను గురించి గ్రామంలో పెద్ద రభస జరుగుతూ ఉంది.'

'నిజమే నసుతో మరిదీ! పట్టు పట్టమంటే, అదిప్పు డెక్కడి కెదు తుంది బాబూ?'

'హరిపాలెం పోవచ్చు గదా?'

'అక్కడికి కెలా వెళుతుంది? పోనీ ఎలాగో వెడుతుం దనుకో! అక్కడ దాని గతేమిటి?'

'నువ్విలా అనడం అన్యాయం వదినా! నువ్వు నీమంచినే చూసుకొంటున్నావు గానీ, ఎదటి వారి సంగతి ఆలోచించడం లేదు. నీస్వార్థం కోసం నువ్విలా అన్నావు బాగానే ఉంది. మరి మాగతేమిటో చెప్పు వింటాను! నీబరువు భారాలు, కష్టసుఖాలలో మేమూ భాగం పంచుకొన్నాము. నీ భాగస్థుల ఇబ్బందులను నువ్వూ గమనించాలి. అది నీ కనీస ధర్మం కూడానూ!'

దుర్గమణి నిట్టూర్పు విడిచి, ఏ సమాధానమూ చెప్పకుండా ఊరుకొంది. ఆ నిశ్వాసం, అనాధనాధుని ఆరాటాన్ని కొంతంత శాంతింప జేసింది.

'జ్ఞానదను నీ అన్నగారి యింట ఉంచడం, నిన్నెంత బాధపెడుతుందో నాకు తెలియక పోలేదు. కానీ, ఈ సమయాన, అంతకు మించి చేయగలిగిం దేమున్నదో నువ్వు చెప్పు. నేనంటున్నానని కాదుగానీ, ఇందులో నీతప్పు కూడా కొంత ఉన్నది వదినా! నేను నీ అన్నగారికి ఈ మధ్య ఉత్తరం వ్రాశాను. ఆయన సమాధానం చూసి, నేనెంతో ఆశ్చర్య పోయాను. పెళ్ళి కన్నీ సిద్ధంగా ఉన్నాయనీ, కేవలం నువ్వంగీకరించనందు వల్లనే, పెళ్ళి ఆగవలసి వచ్చిందనీ నాకు వ్రాశాడు. ఇలా ఎందుకు చేశావు వదినా? ఏవో అభిప్రాయ భేదాలుంటే, సర్దుకుపోవాలి గానీ, ఇలా కాదు కూడదని పట్టుపడితే పను లెలా అవుతాయమ్మా!'

ఈ మాటలని అనాధనాధుడు వెళ్ళి పొయ్యాడు.

ఇంటి పనులన్నీ పూర్తిచేసుకొని జ్ఞానద, కాస్సేపటి కల్లా తల్లి దగ్గర కొచ్చింది. కూతురును చూస్తున్న కొందికీ దుర్గమణి విచారం కట్టలు తెంచుకొని ఉరకలు వేయసాగింది. ఆమెను దగరకు పిలిచి, ఒళ్లో తల పెట్టుకొని, చిన్న పిల్లలా బావురుమని ఏడ్చింది దుర్గమణి.

'అమ్మా!' అన్నది జ్ఞానద తల్లి నోదారుస్తూ. 'నన్నింకా తెలుసుకోవా? నిన్ను నన్ను వేరు పరచడం ఎవ్వరివల్లా కాదు. ఈ యిల్లు బాబా

యిది కాదు. మా నాన్నది. బాబాయి—తన కిష్టం లేకపోతే, అన్నం పెట్టకపోవచ్చు. మానుకోమను. కానీ ఈ యింట్లో నుండి వెళ్లమనడానికి బాబాయికి గూడా హక్కు లేదు. అలా బాబాయి అన్నంత మాత్రాన నేను సిగ్గు పడ బోవడం లేదు. ఆయన అన్నం పెట్టడనీ, పెట్టకపోతే బ్రతక లేమనీ నువ్వనుకోకు అంత అవసరం రాకుండానే ఉండాలి గానీ, వస్తే, బాబాయి అవసరం లేకుండా, నేనే నిన్ను పోషిస్తాను. సరేనా అమ్మా?'

కూతురు వడిలో పడుకొని, తన మనఃక్లేశాలను చాలా వరకు పోగొట్టుకొంది దుర్గమణి. ఆ ప్రశాంతత, ఆమెను నిద్రపొయ్యేట్టు చేసింది. జ్ఞానదైనా, ఏదో ఆవేశంలో అన్నది గానీ, నిజంగా అలాంటి అవసరమే వస్తే తల్లిని ఎలా పోషించ గలదు? ఈ సందేహమే జ్ఞానదకు గూడా కలిగింది.

తల్లీ బిడ్డలను వేరు చేయాలన్న ప్రయత్నం తీవ్రంగా సాగుతున్నట్టు దేవరాణి పసిగట్టింది. ఆమె ఒకనాడు భర్తను చాటుగా కలుసుకొని, పెట్టవలసిన నాలుగూ పెట్టింది.

'ఇలాంటి ఆపద సమయంలో, ఆ తల్లీ బిడ్డలను వేరు చేయడం ధర్మమేనా? అది ధర్మమని, మీ అంతరాత్మ మీకు చెబుతున్నదా? కసాయి వాడు సైతం, తల్లి నుండి బిడ్డను విడదీయడానికి సందేహిస్తాడు. మీకా మాత్రం సందేహం ఉన్నట్టు గూడా కనిపించడం లేదు. మానవుడు పశువుపట్ల చూపించే దయారసంలో, పాతికోవంతు, తోటి మానవుల పట్ల చూపలేక పోవడం ఘోరం!' అన్నది దేవరాణి.

అనాథ నాథుడు నోరెత్త లేక పోయాడు.

ఇది జరిగిన రెండో నాడు దుర్గమణి, మరిదిని తన వద్దకు పిలిపించుకొన్నది.

'నాయనా!' అన్నది దుర్గమణి గాద్గద్యంగా. 'నువ్వు నాకన్న చిన్నవాడివి. నాకు మరిదివి. అందుకే నీచేతులు పట్టుకు చెబుతున్నాను. పెద్దవాడివయినట్లయితే, నీకాళ్ళు పట్టుకొనడానికి గూడా నేను సందేహించను. అనాథబాబూ! నాకు వున్నదల్లా ఒక్కబిడ్డ. నేనా చావు

బ్రతుకుల్లో ఉన్నాను. ఇలాంటి సమయంలో, నన్ను నా కూతురు నుండి వేరచేయ బోకు. నేను కోరేదిదే!'

జ్ఞానద చేతులు. మరిది చేతుల్లో పెట్టి కళ్ళంట నీళ్లు పెట్టుకొంది దుర్గమణి. అనాథ నాథుడు చప్పున తన చేతుల్ని వెనక్కు లాక్కున్నాడు.

'వదినా! నా శక్త్యానుసారం నేనూ ప్రయత్నిస్తూనే ఉన్నాను గానీ ఊరుకోడం లేదు. కొస శవం గూడా, జ్ఞానదను చేసుకొనేందుకు ఒప్పుకోడం లేదు. నువ్వా—నన్నిలా బాధిస్తున్నావు...సరే! జరిగేదేదో జరుగుతుంది గానీ, నీ దగ్గరుండే ఆ కమ్మ లేం చేశావ్ వదినా!' అన్నాడు అనాథనాథుడు.

'మీ అన్నగారి శ్రాద్ధ కర్మలగ్గాను అమ్మాను!'

అనాథబాబు హతాశు డయ్యాడు.

'ఒక్క దమ్మిడీ ఇవ్వలేవు. పిల్లను విడిచి పెట్టనూ లేవు. తీరాచూస్తే నామీద సవారి తిప్పామనుకొంటున్నట్లుంది వదినా! అదేనా నీ అభిప్రాయం!' అని కోపంగా వెళ్ళి పోయాడు అనాథనాథుడు.

దుర్గమణి ఒక్క క్షణకాలం స్తబ్ధుగా కూచున్నదల్లా, గభాలున కూతురు చేయి పట్టుకొని అన్నది:

'నువ్వు నా బిడ్డవు కదూ?...చీకటి పడబోతోంది. కాస్త దీప మన్నా వెలిగించవే జ్ఞానదా!'

అన్యమనస్కంగా ఉన్న జ్ఞానద ఏదో చెప్ప బోయింది. ఇంతలో—

'నిన్ను మృత్యుదేవత గూడా, దగ్గరగా రానివ్వడానికి భయపడు తున్నది. ఇలాంటి మునసష్టపు దానివి—ఇంకా నీకు ఆత్మాభిమానం గూడా ఎందుకే? ఏమే జ్ఞానదా! లోకమంతా ఈసడిస్తున్నా, నువ్వుచావ వేమే! మూడు రోజులు జ్వరం కాచిందో లేదో, ఆ ఘోష్ గారి కొడుకు చనిపోయాడు పాపం! కానీ సంవత్సరం నుండి రోగం నిన్ను తింటున్నా, నువ్వు మాత్రం చావవు. సిగ్గూ శరమూ లేకుండా ఇంకా బ్రతుకు తున్నావు. ఇంకొకతైతే ఈ పాటికి ఆత్మహత్య చేసుకొనేదే! ఫో... నాకళ్ళ ముందు నుంచి—ముందుకు బైటికి వెళ్లు. పది నిమిషాలపాటు

హాయిగా ఉంటుంది ప్రాణానికి. క్షణం సేపు స్థిమితంగా ఉండనివ్వకుండా, చేయింబవళ్ళు జలగలా నాప్రాణాలు పీల్చేస్తున్నావు...కదలవేమే పింజారి ముండా! అలా గుడ్లు మిటకరించి చూస్తావెందుకే?'

నిజంగా జ్ఞానదకు ఆత్మాభిమానమే ఉంటే, ఎప్పుడో ఆత్మహత్య చేసుకోవలసింది. కానీ ఆ పని నామె చేయలేదు. భూమాతలా, సకలావమానాలు, మౌనంగా స్వీకరించి, ఇంటి పనుల్లో నిమగ్నమయింది. ఇలాంటి సంఘటనలు ఎన్నో సార్లు జరిగాయి. ఒక్కసారైనా జ్ఞానద—

'అమ్మా! చావడ మెలాగో నాకు తెలియక పోలేదు. ఆ పనిచేసే ధైర్యం నాకున్నది. అయినా ఓర్పుతో అన్నింటినీ సహిస్తున్నాను. నేను చనిపోయి, నిన్నింకా కష్టాలలోకి నెట్టడం ఇష్టం లేక నే, బ్రతుకుతున్నాను.'

అని చెప్పలేదు.

సాయంత్రపు చాకిరీ అంతా అయింది. చిన్న దీపం వెలిగించి తులసి కోటవద్ద పెట్టింది జ్ఞానద. ఇంత సేపటినుండీ, మనస్సును తొలిచివేస్తున్న విచారం, వీలు చూసుకొని వెలికురికింది. ఆమె రెండు చేతులూ చాపి, సాష్టాంగపడింది తులసి చెట్టుకు.

'భగవంతుడా! ఇక్కడే మా నాన్న గారు పోయారు. నన్నూ, మా అమ్మనూ గూడా, తీసుకెళ్ళి, మా నాన్న దగ్గరకు చేర్చు. మేమీ కష్టాలను బాధలను ఇక భరించలేము. మా శక్తులు సన్నగిలుతున్నాయి.'

ఇదీ ఆమె ప్రార్థన!

## 9

చైత్ర మాసపు బహుళ పక్షం మంచికాలం కాదని పెద్ద లంటారు. ఈ పది హేను రోజులూ ఎలాంటి శుభకార్యాలూ జరుప బడవు.

ఈ కారణంతో నే దేవరాణి తన పుట్టింటి కెళ్ళే ప్రయత్నం తాత్కాలికంగా ఆగిపోయింది. శుక్ల పక్షం వచ్చింది. శేత వెన్నెలలు మెల్లగా విరియ సాగాయి. దేవరాణి చిన్నన్న గారు, చెల్లినీ, మానురినీ, వెంటతీసుకెళ్లేందుకు వచ్చాడు.

ఆ రోజే ప్రయాణం. భోజనానంతరం ప్రయాణమై వెళ్ళేందుకు ఏర్పాట్లు జరిగాయి. ఆ సమయంలో, ఎందుకో అతులు డక్కడికి కొచ్చాడు. స్వర్ణమంజరి అతన్ని గూడా భోజనాని కాహ్వానించింది.

దేవరాణి చిన్నన్నగారు, అతులుడు, భోజనానికి కూచున్నారు. మాధురి వడ్డన సాగిస్తున్నది. స్వర్ణమంజరి వారి కల్లంత దూరంలో కూచున్నది. ఉదయమే జ్ఞానద చేత వంట చేయించి, వడ్డనకు మాత్రం రావద్దని చెప్పింది స్వర్ణమంజరి. ఇదెందుకు చెప్పినా, జ్ఞానదకు చాలా మంచిదే అయింది. ఆమె ఇటీవల ఎవరికంట బడటానికైనా హడలిపోతూ ఉంది. ఎవరు తనను...ఏమంటారో మరి? అందుకే ఎవరికంటా పడకుండా తప్పుకు తిరుగు తున్నది.

అతుల్ బాబుకూ, మాధురికీ పెళ్ళి అవుతుందనీ, మాధురిని కలకత్తాకు తీసుకెడుతున్నారనీ, ఆ పిల్లను బ్రహ్మాండంగా అలంకరించారు. వడ్డించేటప్పుడు సిగ్గు వల్ల మాధురి ఎప్పుడన్నా పొరబడితే, వెయ్యికళ్లతో కనిపెడుతున్న పెదతల్లిగారు 'ఛీ! అదేమిటమ్మా! చేతగాని పిల్లా...అభాగ్యురాలా! సువ్రతలకు పోవే' లాంటి సున్నితమైన, గారాబం తొణికిసలాడే పదాలతో కోప పడేది. ఒక్కొక్కసారి చిరునవ్వు గూడా నవ్వేది. అదే సమయాన, లోకంలోని ప్రతి ప్రాణిచేత అసహ్యించు కోబడిన మరొక యువతి, వంటింటి మూలన నక్కి, కావలసిన పదార్థాలను మాధురికి అందిస్తున్నది.'

స్వర్ణమంజరి, మాధురి పెళ్లి విషయం ఏకరువు పెట్ట నారంభించింది. మాధురి అక్కడ ఉండలేక వంటగదిలోకి వచ్చింది.

'ఏం కావాలి చెల్లీ?' అన్నది జ్ఞానద.

'ఇంకేమీ వద్దక్కయ్యా! ఇక వడ్డించడం నా వల్ల కాదు.' అని ఖాళీగా ఉన్న పళ్ళెరాన్ని క్రింద పెట్టి వెళ్లి పోయింది.

ఓ క్షణం గడిచింది.

'అమ్మాయ్! కొద్దిగా ఉప్పు వడ్డించమ్మా!' అన్నది స్వర్ణమంజరి.

ఆ పిలుపు వినిపించినా, మాధురి వెళ్ళలేదు.

'మాధురీ! ఏం చేస్తున్నావమ్మా అక్కడ? ఉప్పు లేదని, నీచిన్న మామగారు, అన్నం తినకుండా కూచున్నారు.'

ఈ మాటు గూడా మాధురి చెప్పలేదు.

జ్ఞానద ఇక ఉండలేక పోయింది. ముట్టుకొన్నంత మాత్రాన ఉప్పు చెడిపోయే పదార్థం కాదనీ, పెదతల్లి పిలుపు—ఒక్క మాధురికే గాక, తనకు గూడా వర్తిస్తుందనీ అనుకొన్నది. తన చిరుగుల చీరను, ఒంటి నిండా సర్దుకొన్నది. ఉప్పు గిన్నెను పట్టుకొని వాకిలి దాకా వెళ్లింది. భోజనం చేస్తున్న వారెవ్వరూ చూడలేదు. స్వర్ణమంజరి మాత్రంచూసింది. ఆపాదమస్తకం ఈర్ష్యతో జ్ఞానద నొక సారి పరికించిందామె. కోపంతో, భగ్గున రగిలిపోయింది. అయినా—ఎదుట మనుషులున్నారు గనుక, తనను తను సంబాళించుకొని మెల్లగా అన్నది:

'నిన్నెవరు తెమ్మన్నారే! అక్కడ మాధురి లేదూ?'

'లేదు పెద్దమ్మా! ఎక్కడికో వెళ్ళింది!'

'ఓహో! అందుకని తమరు దయచేశారన్నమాట. ఇలా రావడానికి నీకు సిగ్గువేయడం లేదులే? నీపాపిష్టి ముఖాన్ని బైటపెట్టొద్దని ఎన్ని సార్లు చెప్పానే, ఇంతలోనే మరిచిపోయావా? అతులు డిక్కడ భోంచేస్తు న్నాడు గదా, నీ అందమంతా ఇక్కడ వొలక పోద్దామని, ఉప్పు వంకతో వచ్చావన్నమాట. జాగ్రత. ఇలాంటి పిచ్చివేషాలు నాముందు వెయ్యకు. గిన్నె అక్కడ బెట్టి, ముందు లోపలకు తగలడు—'

జ్ఞానద అలానే వెళ్ళిపోయింది.

స్వర్ణమంజరి తనే ఉప్పు వడ్డించి, మామూలు స్థానంలో కూచుని అతులునికేసి చూసింది. అతను తల వంచుకొని ఉన్నాడు.

'అతుల్ బాబూ! నువ్వు మా వాడివి! సిగ్గు పడవలసింది నువ్వు కాదు నాయనా! ..తిను...అయ్యో! అలా తల వంచుకొని కూచున్నా వేం అతుల్ బాబూ?'

'అక్కాయ్! ఆ పిల్లెవరు?' అన్నాడు దేవరాణి చిన్నన్నగారు.

'అం...ఎవరూలేరు లెన్డూ! మీరు భోజనాలు కానివ్వండి.' ఈ వ్యంగ్య వాక్యంతో అతులుణ్ణి సంతోష పెడదామని స్వర్ణమంజరి యత్నిం చింది. కానీ అతనికి అన్నం సహించ లేదు. తినలేక పోయాడు.

మాధురి 'మైకం' లో పడి తను జ్ఞానద విషయం మరిచి పోయిన మాట నిజమే ననుకొన్నాడు అతులుడు. కానీ నిజం అది కాదేమో! జ్ఞానద అతని హృదయంలో ఓమూల గూఢంగా నిలిచిపోయింది. ఇప్పు

డామె తనను అనురాగంతో చూస్తుందో, అసహ్యించుకొంటుందో చెప్ప లేదు. కానీ ఒకానొకప్పుడు, ఆమె తనను గాఢంగా ప్రేమించింది. తనను సేవించింది. ఈ విషయాన్ని తనింకా మరిచి పోలేదు. ఆ రోజుల్లో గూడా, జ్ఞానద తన ఎదుటికి వచ్చేది కాదు. ఇప్పుడూ రాదు. ప్రక్క ప్రక్కలనే తచ్చాడు తుంటుంది. అలాంటి సందర్భంలో, ఆధారంలేని అలాంటి నిందను జ్ఞానదకు అంటగడితే, అతులు డెలా సహిస్తాడు?

దేవరాణి, కూతురుతో సహా పుట్టింటి కెళ్లి పోయింది. పోబోయే ముందు దుర్గమణిని కలుసుకొందా మన్నా వీలు పడలేదు. జ్ఞానద మాత్రం వంటింట్లో కనిపించింది. దేవరాణి అటూ ఇటూ పారజూచి, జ్ఞానద చేతిలో పదిరూపాయల కాగితం పెట్టి, దొంగతనం చేసిన దానిలా, చప్పున బైట పడ్డది. జ్ఞానద నమస్కరించిందన్న సంగతి ఆమెకు తెలి యనే తెలియదు.

ఆ యింట్లో తనను, కాస్తంత దయతో చూసే పినతల్లి గూడా వెళ్ళి పోయిందన్న విషయం తలచుకొని, జ్ఞానద భయపడింది. పిన తల్లి ఏ యే సహాయాలు చేసిందో, ఏవి చేయలేదో జ్ఞానదకే తెలుసు. జ్ఞానద విచారించినపుడు, ఆమె గూడా విచారించేది. తన విచారాన్ని పోగొట్టా లని, దేవరాణి ఎన్నో విధాల ప్రయత్నించేది. ఔదార్యంతో ఓదార్చేది. అలాంటి పినతల్లి గూడా ఇపుడు ఆమె సమీపంలో లేదు. లేదన్న స్పృహ కలిగినప్పుడల్లా జ్ఞానద హృదయం భీతితో కంపించి పోయేది. నలుకెలం కులా ప్రళయ కాలానంత భయద జీమూతాలు మూసిరి, తనను మ్రింగజూస్తు న్నట్లు అల్లల్లాడి పోయేది.

వైశాఖమాసం సగబడింది.

ఒకనాడు అనాధనాధుడు ఆఫీసు కెళ్ళడానికి ఆయత్తమౌతున్నాడు. స్వర్ణమంజరి దీనవదనంతో అతన్ని సమీపించింది.

'ఏమిటి వదినా?' అన్నాడు అనాధనాధుడు భయంగా.

'ఏమయినా నువ్వూ నేనూ చేయగలిగిందేమీ లేదు మరిదీ! మన దుర్గమణి...'

'ఆఁ'

చేతిలో హుక్కా క్రిందబడి పోయింది.

'ఏమిటి వదినా? ఆ సంగతి నా కింకా తెలియదే!' అని తొక్కిసలాడాడు అనాథనాథుడు.

'అయ్యో! ఇంత మాత్రానికే అలా హైరానా పడతావేం మరిదీ?' అన్నది స్వర్ణమంజరి తాపీగా! 'ఆవిడ ఇంతలోనే చావదుగానీ ఎక్కువ కాలం బ్రతకను కూడా బ్రతకలేదు. మహా అయితే, మరో రెండు వారాలదాకా ఈడుస్తుందను కొంటాను.'

ఆమె దాటి పోయిం తర్వాత, సంవత్సరం దాకానో, ఆరు మాసాల దాకానో, పిల్లకు పెళ్ళి చేయడం పడదు. మాధురి వివాహం వచ్చే ఆషాఢంలో చేయాలను కొంటున్నాను. ఈ విషయమై నేనింకెవరి సలహాలూ పాటించ దలచ లేదు. అటువంటి అనువైన సంబంధం, అన్నప్పుడల్లా దొరక మన్నా దొరకదు. ఇచ్చి పుచ్చుకోవడాలు, లావా దేవీలలో తబిసీళ్ళు కూడా రావు. మాధురినే చేసుకోవాలని పిల్ల వాడు కూడా అనుకొం టున్నాడు. ఇలాంటి సదవ కాశాన్ని జారవిడవడం-ముమ్మాటికీ నా కిష్టం లేదు.'

'నాకూ ఇష్టం లేదు వదినా!' అన్నాడు అనాథ నాథుడు. 'ఈ యింటికి నువ్వే అధిపతివి. మాధురి నా కూతురే కాదు; నీకూ కూతురే! దాన్ని నువ్వు అతుల్ బాబుకే ఇస్తావో, అమరేంద్రుడికే ఇస్తావో నీయిష్టం. ఈ విషయంలో, నేనెంత మాత్రం జోక్యం కలిగించుకోను.'

స్వర్ణమంజరి సంతృప్తిగా నవ్వింది.

'నువ్వు చెప్ప నవసరం లేదు మరిదీ! నేనామాత్రం అర్థం చేసుకో గలను. నువ్వు తాలాకోలీ మనిషివి కాదని, నా కేనాడో తెలుసు. అందు కనే, నేను చెప్పినట్లు చెయ్యి. అనుమానాలూ, గినుమానాలూ పెట్టుకొని తాత్సారం చెయ్యబోకు. ఎవడో ఓ పుల్లాయను పట్టుకొచ్చి జ్ఞానద కిచ్చి చేసెయ్. నీ పీడ విరగడై పోతుంది. అలా చెయ్యక పొయ్యావంటే— మాధురికి పెళ్ళిగావడం చాలా కష్టం! నలుగురూ నా నా విధాలుగా నిన్నే అంటారు.'

స్వర్ణమంజరి ఉపదేశాన్ని మననం చేసుకొంటూ అనాథ నాథుడు ఆఫీసు కెళ్ళాడు. ఆనాటి మధ్యాహ్నమే స్వర్ణమంజరి, తోడికోడలు గదిలో కొచ్చి 'చెల్లీ!' అని పిలిచింది.

ప్రయత్న పూర్వకంగా ఇటు కేసి తిరిగింది దుర్గమణి.

'అక్కయ్యా! నాకీ కష్టాలు లేకుండా ఆశీర్వదించు తల్లీ! నేనీ యాతనలు పడలేకుండా ఉన్నాను' అన్నది దుర్గమణి.

'లేదు...త్వరగా నయమవుతుంది చెల్లీ!'

దుర్గమణి మాట్లాడ లేదు.

'జ్ఞానద చాలా పెద్దదైంది చెల్లీ! ఇలా మూభావంగా ఎంత కాలమని ఊరుకోనేటట్లు? దీని పెళ్ళిని గురించే, ఒక మనిషితో సంప్రదింపులు జరుగుతున్నాయి. అతనికి తల్లి దండ్రులు లేరు. ఉత్తముడు...పిల్లను చూడడానికి వస్తానన్నాడు. నేను జ్ఞానదను ముస్తాబు చేదామనుకొంటున్నాను.'

ఈసారి గూడా దుర్గమణి మాట్లాడ లేదు.

'చెల్లీ! భగవంతుని దయవల్ల పిల్ల అతనికి నచ్చిందంటే—మరిదిగారి ప్రాణం కొస్తంత కుదుట బడుతుంది. జ్ఞానద పెళ్ళిని గురించి, ఈ మధ్య ఆయన సరిగ్గా అన్నంగూడా తినడం లేదు చెల్లీ! ముందు పిల్లది నచ్చితే-ఇచ్చి పుచ్చుకోవడాలు నేను—'

'అక్కయ్యా!' అన్నది దుర్గమణి మధ్యలోనే అందుకొని. 'ఈ సంబంధమన్నా స్థిరపడాలని ఆశీర్వగించు తల్లీ!' అని కళ్ళంట నీళ్ళు పెట్టుకొంది.

'ఈ పిల్లకు త్వరలో పెళ్లి కానిమ్మని, నేను ప్రతి నిత్యం భగవంతుణ్ని వేడు కొంటుంటాను చెల్లీ!' అన్నది స్వర్ణమంజరి. 'మరిదిగారు నూట యాభై తెస్తాడన్న మాటే గానీ, ఎంత ఖర్చో చూడు చెల్లీ! దీనికి తోడు మాధురిగూడా పెళ్ళీడు కొచ్చింది. పైగా మన జ్ఞానద పెళ్లొకటి కాళ్లకు చుట్టుకొనె. అనాధ నాన్నుడు అన్ని విధాలా ఉడ్డు కుడిచి పోతున్నాడు. ఈ సంగతి నీతో చెప్పడానికి సిగ్గు పడుతున్నాడు. నీ భాగం ఇల్లు ఎక్కడన్నా తాకట్టుబెట్టి డబ్బు తెచ్చుకోవచ్చు. ఇందు కోసం నువ్వేమీ శ్రమపడ నవసరం లేదు. స్టాంపు మీద సంతకం చేస్తే సరి పోతుంది. మిగతా రాతకోతలన్నీ మరిదిగారే చూసుకొంటారు. ఇలాంటి కట్టు దిట్టాలు లేనిదే, డబ్బిచ్చి చావరు మరి. అంతా రోజుల మహాత్యం...'

'నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి అక్కాయ్! నేను మాత్రం ఇంకెంత కాలమని బ్రతుకుతాను? కానీ, నా బిడ్డ దిక్కులేని పక్షిలా కాకుండా చూడండి. అదే నా ప్రార్థన.' అన్నది దుర్గమణి.

'అలా ఎందుకు చేస్తాం చెల్లీ? అయినా తండ్రికీ, పినతండ్రికీ, తల్లికీ, పెత్తల్లికీ భేదమంటూ ఉంటుందా? మేమిలాంటి కిరాతక చర్యలు చేసే వాళ్ళమయితే, రాత్రిం బవళ్ళిలా, మెదళ్ళు కరిగి పోయేలా ఆలోచిస్తూ ఉంటామా? మా దృష్టికి జ్ఞానద, మాధురి సమానమే చెల్లీ! ఏం జ్ఞానదా! అలా చూస్తూ కూచోక పోతే, మీ అమ్మకు కాస్తంత విసర కూడదు లే?'

ఇత్యాది సంభాషణల ద్వారా దుర్గమణికి ఎన్నో ఆశలు రేపి, నిష్క్రమించింది స్వర్గమంజరి.

దుర్గమణి శుష్క వదనం ఆనందంతో కాంతివంత మయింది. జ్ఞానద చేతిలోని విసన కర్రను లాగి, దూరంగా పారేసి, ఆమెను దగ్గరగా తీసుకొంది.

'ఇలా నా దగ్గరగా, కాస్సేపు పడుకో తల్లీ!' అన్నది దుర్గమణి కూతురును హృదయానికి హత్తుకొంటూ. 'నాలాంటి దురదృష్ట వంతురాలి కడుపున పుట్టడం వల్ల నువ్వెన్నో బాధ లనుభ వించావు. ఎన్నో అవమానాలకు గురి కాబడ్డావు. కనీసం మగవాడిగానన్నా పుట్టినట్లయితే, నీకీ ఇబ్బందు లుండేవి గావు!'

ఈ అనురాగపు మైకానికి లోగి, ఆ తల్లీ బిడ్డలిద్దరూ గాఢంగా నిద్ర పోయారు. హఠాత్తుగా జ్ఞానద లేచింది. ఎప్పుడు మేలుకొన్నదో గాని, దుర్గమణి చాలా సేపటినుండీ కూతుర్ని అలా లేపు తున్నది.

'జ్ఞానదా! త్వరగా లే అమ్మా! నా తగరపు పెట్టెలో, కొద్దిగా సబ్బు ఉండాలని నా జ్ఞాపకం. వెళ్ళు, దానితో, ముఖము, కాళ్లు చేతులు శుభ్రంగా కడుక్కురా... ఊఁ త్వరగా లేతల్లీ! నువ్వు ఎవరి మాటా విన వమ్మా! నీలో ఉన్న పెద్ద దోషం ఇదే!'

ఈ రకంగా కూతుర్ని తొందర పెట్టింది దుర్గమణి.

తల్లి మాటను అక్షరాలా అమలులో బెట్టింది జ్ఞానద.

'జ్ఞానదా! ఏదో తూ తూ మంత్రంగా స్నానం చేసి రాకు. శుభ్రంగా రుద్దుకొని స్నానం చెయ్యి. అన్నాను గదా అని అక్కడే గంటల కొద్దీ రుద్దు కొంటూ కూర్చోబోకు. తొందరగా తెముల్చుకొని బైట పడు. వారే క్షణాన్నయినా రావచ్చు.' అన్నది దుర్గమణి.

అలాగే స్నానం చేసి వచ్చి, స్తబ్ధుగా నిలబడింది కూతురు. దుర్గమణి నిస్సత్తువుతో ఉండిగూడా, లేని వోపిక తెచ్చుగుని, లేచి, పాత ట్రంకు పెట్టె ముందు కూలబడ్డది. అందులో నించి, చాలా కాలం నాటి రంగు చీరా, పాత జాకెట్టూ బైటికి తీసి కూతురు వేపు సాలోచనగా చూసి, ఇలా అన్నది:

'అయ్యో! నా మతి మండి పోను, ఇన్ని చెప్పాను గానీ, నీకు తల దువ్వడమే మరిచి పోయానమ్మా! సరే, మునిగి పోయిందేమీ లేదు గానీ; నువ్విలా రా. క్షణంలో తల దువ్వేస్తాను.'

'వద్దమ్మా! అసలే నీరసంగా ఉన్నావు. నువ్వా పని చెయ్యలేవు. నీ కాళ్ళట్టు కొంటాను. నన్ను బలవంత పెట్టకు. తల దువ్వు కోడం నాకు చేత నవును. నేను దువ్వుకొంటాను, సరా?'

'ఏమిటీ? నేనా పని చేయలేనా నువ్వంటున్నది! భలే దానివే జ్ఞానదా! తలలు దువ్వించుకోవాలని ఎంతమంది ఆడపిల్లలు నా చుట్టూ చేరే వారో నీకు తెలియదా జ్ఞానదా? ఇలారా. తొందరగా దువ్వుతాను.'

ఈ మాటలని దుర్గమణి బలవంతంగా కూతుర్ని దగ్గరకు తీసుకొని తల దువ్వింది. కాళ్లకు పారాణి పెట్టింది. ముఖాన తిలకం తీర్చి దిద్దింది. పెదిమలకు రంగు నద్దింది. ఇవన్నీ పూర్తయాక, కూతురు ముఖం తనవేపు త్రిప్పుకొని, పరిశీలనగా, తదేకంగా చూసి, తనలో తాను అనుకొన్నది:

'నా కూతురు అందకత్తె కాదు అనే వాళ్ల మాటలకు ఆధారాలు లేవు. శరీరం నలుపుగా ఉండటము, తెలుపుగా ఉండటమే అందానికి ముఖ్యాకసరం కాదు. ఈ అందమైన కళ్ళు, చక్కని పలువరుస, నీడలు దేరే ముఖము, ఎందుకు మాడకో నా కర్థం గాదు. బహుశః ఇంక నే నేపిల్లనూ అలంకరించను గాబోలు, ఇదే నా అంతిమాలంకరణ గావచ్చు.'

ప్రొద్దుగూక బోతున్నది. వెలుగు క్రమ క్రమంగా కరిగిపోయి, ఆవిరులెత్తి నల్లగా, మారి పోతున్నది. దుర్గమణి మనస్సులో చీకటి వెలుగుల నీడలు జీరాడు తున్నాయి. కూతుర్ని దాపులో నే కూచోబెట్టుకొన్నది. అప్పటికే, నలుగు రైదుగురు ఆడవాళ్ళు, పెళ్ళి కొడుకును చూదామని వచ్చారు. అన్నీ సక్రమంగా జరిగాయి. పెళ్ళి కొడుకు, ఆయన బంధువులు వచ్చారు. పిల్లను పిలిచారు. ప్రేక్షకాంగనలు, వధుణ్ని తొంగితొంగి చూడ నారంభించారు.

ఇప్పుడా చీకటి ముసిరిన గదిలో, మరణ శయ్యమీద ఒంటరిగా కూచుని ఉన్నది దుర్గమణి. ఆమె గుండెలు ఫలితం కోసం వేగంగా కొట్టుకొంటున్నాయి. ఆందోళనతో సతమతమయి పోతున్నదామె.

పెళ్ళి కొడుకు, మధ్య వర్తులతో సహా వెళ్ళి పోయాడని దుర్గమణికి తెలిసింది. వారెక్కి వచ్చిన బండి కదిలిన చప్పుళ్లు క్రమంగా గాలిలో కలిసి పోయాయి. నీల కంఠ ముఖర్జీ గారి భార్య తరంగిణీ దేవి వచ్చి 'దుర్గా! పిల్లవారికి నచ్చ లేదుట. వెళ్ళి పోయ్యారు!' అన్నది.

దుర్గమణి అలానే కళ్లు మూసుకొని పడుకొన్నది. తదితర వివరాలేమీ ఆమె అడగ లేదు.

'దుర్గా! బక్క చిక్క బొమికలు బైటి కొచ్చిన పిల్ల, ఎవరికైనా నచ్చుతుందా? ఈ అనుభవాన్ని జ్ఞాపక ముంచుకో. పిల్లకు కాస్త మంచి తిండి, గుడ్డా, ఇవ్వు. ఒక్క సంవత్సరం పాటు దాని ఆహార విషయంలో శ్రద్ధ తీసుకొన్నావంటే, పిల్ల, బాగా, బొద్దుగా ఎదుగుతుంది. అప్పుడు దీని పెళ్ళి కోసం, అంతగా ఆరాటపడ నవసరం లేదు. ఎవడో ఒకడు ఎగిరి గంతేసి, లాక్కు పోతాడు' అని సలహా యిచ్చింది తరంగిణి.

అది ఉచితమైన సలహాయే ననడాని కేమీ సందేహం లేదు. కానీ దాని నాచరించడం మాటలా? చక్కగా, పుష్టిగా పెంచడానికి ముందు బోలెడంత డబ్బు కావాలి. దానికైనా ఎన్నో రోజులు పడతాయి. అంత కాలం జ్ఞానద అవివాహితగా ఉండటం సంభవమా? ఇప్పటికే పదిహేనేళ్ళొచ్చాయి. ఇంకో సంవత్సరంపాటు ఆగడమంటే—బాబోయ్ లోకులు కాకుల్లా పొడిచి చంపరూ? ఇప్పటికే తమను వెలేయాలని ఊరి వారు ఆలోచిస్తున్నారు.

చీకట్లు మరింత దట్టంగా ముసిరాయి. ఆ గదిలో ఇంకా దీపం వెలిగించ బడలేదు. తన అలంకారాలను ఒలిచి వేయాలని జ్ఞానద ఆ గదిలో కొచ్చింది. అదే సమయాన నిశ్చలంగా దుర్గమణి మంచానికి కరుచుకు పోయి ఉన్నది.

కొన్ని క్షణాలు గడిచాయి.

జ్ఞానద తల్లి పాదాలకద్ద కూచుని భోరుమని ఏడ్చింది. కూతురువచ్చిన సంగతి దుర్గమణికి తెలుసో తెలియదో గానీ, ఆమె మాత్రం మాట్లాడ లేదు. చాలా సేపు అలానే కూచుంది జ్ఞానద. మనోవ్యథ, ఆకలి కలిసి

ఆమె ప్రాణాను హరించి వేశాయి. ఉప్పెనలా ముంచు కొస్తున్న నిద్రను తాళలేక, అక్కడే, వాలి పోయింది జ్ఞానద.

## 10

దుర్గమణి ఆరోగ్యం క్రమంగా క్షీణించి, చివరకు ప్రమాదకర పరిస్థితి లోకి వచ్చింది. దానికి తోడు కూడి మిడి జ్ఞానంగల 'ఆడ ముండలు' ఉన్న ఆ కాస్త ప్రాణాన్ని మరింత హింసించ సాగారు.

'దుర్గా! నువ్వన్ని విధాలా దురదృష్ట వంతురాలి వేనమ్మా! ఇన్నేళ్లు నీ కూతురు కొచ్చాయన్న మాటే గానీ, లాభమేమిటి? ఆ గుంటది మీ పవిత్ర పితృ లోకాలకు స్థాన భ్రష్టత్వం కలిగిస్తుందే గానీ, మంచి చేయదు, చేయబోదు. ఈ అపవిత్రత మూలాన్నే నీకిన్ని తులసి నీరివ్వడానికి గానీ, నీ దేహానికి సంస్కా రాదులు చేయడానికి గానీ జ్ఞానద పనికి రాదు' ఇలాంటి బోధనల వలన, దుర్గమణి హృదయం మరింత కరుకు వారింది. కూతురుపట్ల సహజంగా ఉండవలసిన ప్రేమకు బదులు అసహ్యత, ఆ స్థానా న్నాక్రమించింది.

ఒకసారి మరిదిని పిలిపించి ఇలా అన్నది దుర్గమణి:

'అనాథ్ బాబూ! మన వీధిలోని గోపాల భట్టాచార్యులు, మళ్ళీ పెళ్ళికై ప్రయత్నిస్తున్నాడని విన్నాను. నేను చనిపోక ముందే, ఈ విష యం తేల్చివెయ్ నాయనా!'

'లేదు వదినా!' అన్నాడు అనాథుడు. 'గోపాల భట్టాచార్యులు, ఇంకో పెళ్ళి చేసుకొంటాడంటే నేను నమ్మను. ఎవరో నవ్వు తాలకు గాను, నీతో ఆ మాట అన్నారేమోగానీ, అది నిజం కాదు వదిన గారూ!'

'నాతో హాస్యంగా ఎవరు మాట్లాడుతారు బాబూ! అయినా అతను మగవాడు. వయస్సుతో నిమిత్తం లేకుండా నే, అతను ఎన్ని పెళ్ళి ళ్లయినా చేసుకోవచ్చు. అతని ఈడు వాళ్లు ఎందరా పని చెయ్యలేదు గనక! ఏదో విధంగా, ఈ పని సానుకూల పడేట్టు చెయ్యి. నా కూతురు చేతి నీరు నేను తాగేందుకు, దానిచేత నేను దహనసంస్కారాలు జరిపించు కొనేందుకు నాకా అవకాశాన్ని కలిగించు నాయనా!' అన్నది దుర్గమణి.

'తొమ్మిది మాసాలు మోశాను. కన్నాను. ప్రాణంలో ప్రాణంగా పోషించాను. పెద్ద దాన్ని చేశాను. ఇన్ని చేసినా, దాని చేతి నీరు తాగే

మాత్కు నాకు లేక పోవడం, అన్యాయం! నాశనానికి నిష్పంటించే యోగ్యత గూడా నా కూతురుకు లేక పోవడం ఘోరం!' అనుకొన్నది దుర్గమణి! 'నాయనా!' అని సంబోధించింది మరిదిని. 'ఎలాగైనా సరే, ఎవరికైనా సరే ఇచ్చి, జ్ఞానదకు పెళ్లి చెయ్యి. ఇంత కంటే, నిన్ను నేనేమీ కోరను. ఇదే నా చివరి వాంఛ.'

నిజా నిజాలు తేల్చుకొందామని అనాథ నాథుడు ఆనాడే గోపాల భట్టాచార్యుల దగ్గర కెళ్ళి, సంగతి కనుక్కొన్నాడు. అతను వివాహ మాడాలన్న అభిప్రాయంలోనే ఉన్నాడట. నలుగురైదుగురు, అప్పటికే, ఈ విషయంలో ఆయనను ప్రాధేయపడి, బ్రతిమిలాడి వెళ్ళారట. ఈ ఈ సంగతులన్నీ విని, అనాథుడు ఆశ్చర్య పోయాడు.

గోపాల భట్టాచార్యుల వారు, జ్ఞానదను వివాహ మాడడానికి, ఎలాగో అంగీకరించారు. అంగీకరించారన్న సంగతి దుర్గమణికి తెలిసింది. ఆమె ఆనందానికి మేర లేదు. ఆమె హృదయం ఇప్పుడు సంతృప్తితో నిండి పోయింది. నలుగురూ నానారకాలుగానూ అన్నారు; అన్నారని ఆమె భయపడ లేదు. తను చచ్చేలోగా, కూతురు వివాహిత అవుతుంది. అంత కన్న తను కోరవలసిందేమీ ఈ జగత్తులో లేదని ఆమె నిశ్చయించుకొన్నది.

అయితే ఈ సంతృప్తి ఆమె కెక్కువ సేపు దక్క లేదు. పిల్లను చూసుకొందుకు, ఆచార్యుల వారు వస్తారని వార్త వచ్చింది. దుర్గమణి పేక మేడలు, కుప్పలా కూలి పొయ్యాయి. క్షణకాలం క్రింద దేదీప్యంగా భాసించిన ఆమె ఆశలు, ఇప్పుడు కరడుగట్టి, మొరడు దేరి, కొరడు వారి పొయ్యాయి. ఆమె మరిదిని పిలిపించి ఇలా అన్నది:

'మరిదీ! న్యాయంగా ఈ ధర్మాన్ని మీ అన్నగారు, నిర్వహించ వలసి ఉన్నది. వారికి మారుగా నువ్విప్పుడా పని చేస్తున్నావు. ఈ పిల్లను, నా దహన కార్యాలు చేసేందుకు అర్హురాలినిగా చెయ్యి. ఇంతకన్న నిన్ను మరేమీ కోరను. నాయనా అనాథ్! ఈ నా చివరి వాంఛను తప్పకుండా నెరవేర్చు. వచ్చే పంచమి నాడు మంచి లగ్న మున్నదిట. పిల్లను చూసు కొన్న తరువాతే, నిశ్చయం చేసుకొమ్మని గోపాల భట్టాచార్యులతో చెప్పి రా నాయనా!'

కన్న తల్లికి దహనాదులు నెరప డానికూడా తను పనికి రానని తెలిసిం తరువాత, జ్ఞానద ముక్కలు ముక్కలయి పోయింది. ఇతరులకు తను పనికి రావచ్చు. రాక పోవచ్చు. కానీ, తన రక్తంలో నించి పెంచి, పెద్ద చేసిన తల్లికి కూడా తను పనికి రానసే సరికి, తన జీవితం, ఎంత విలువ లేనిదో, అర్థరాహిత్య మయినదో, ఆమెకు స్పష్టంగా తెలిసి పోయింది.

చీకటి పడడానికి ఇంకా ఆలస్యముంది. జ్ఞానద తల్లికి పథ్యం తయారు చేస్తున్నది. ఆమెను చూడడాని కెవరో వచ్చారు. స్వర్ణమంజరి గబ గబా లోపలికొచ్చి, జ్ఞానదను తొందర పెట్టింది. అట్టే అలంకారం అక్కర లేదనీ, ఏదో విధంగా త్వరగా తెముల్చుకు రమ్మనీ చెప్పింది.

అనాధ నాధుడు ఇంట్లో లేక పోవడం వలన, ఆ బరువు భారాలు స్వర్ణమంజరి మీద పడ్డాయి. ముసలి వారి కన్న యువకులకే, ఆడ వారి అందచందాలు బాగా తెలుస్తాయన్న అభిప్రాయంతో, గోపాల భట్టా చార్యుల వారు, తన బావమరిదిని వెంట బెట్టు కొచ్చాడు. సాధారణా లంకారంతో పిల్లను తీసుకు రమ్మన్నది కూడా, ఆ బావమరిది గారే!

అతగాడు ఆరుగంటల బండిలో కలకత్తా వెళ్ళాలి. అందుకే తొందర పడుతున్నాడు. అతని తొందరకు తగినట్టు, జ్ఞానద ఎంత సేటిపకీ బైటికి రావడం లేదు. తలుపు వెనక నుండి స్వర్ణమంజరి చాలాసార్లు పిలి చింది. అయినా రాలేదు. చివరికి పనిమనిషి వెళ్ళి జ్ఞానదను లాక్కు వచ్చింది. ఆమెను చూసీ చూడటంతోనే స్వర్ణమంజరి నిప్పులు తొక్కిన కోతిలాగా మండి పడ్డది.

'ఇలా సింగారించుకొని రమ్మన్నారులే నిన్ను? ఛా. ఈ గంత లన్నీ విప్పేసి త్వరగా రా. ఊఁ. కదులు ముందు' అని గర్జించింది స్వర్ణమంజరి.

ఈ గొడవంతా ఆ హితులకు తెలిసింది. ఆచార్యుల వారి బావ మరిది స్వర్ణమంజరితో 'అమ్మా! ఇలా ఉన్నా ఫరవాలేదు. తీసుకు రండి. అవతల నాకు చాలా పనులున్నాయి. త్వరగా వెళ్ళాలి' అన్నాడు.

పని మనిషి జ్ఞానదను వారి ముందుకు తీసు కొచ్చింది. వారు చూశారు. బలవంతాన నవ్వు నాపుకొంటూ, 'ఏ కబురూ రేపు చెబుతా' మని వెళ్ళి పోయారు. బావ మరిది గారికి బండి అందదని, పెట్టిన ఫలహారాలు గూడా ముట్టుకోకుండా వెళ్లారు.

వారటు వెళ్లడంతోనే స్వర్ణమంజరి చేసిన హంగామా, లేవనెత్తిన గందర గోళం ఇంతా అంతా గాదు. ఈ గొడవ విని, జనం పోగయ్యారు. ఆరు గంటల బండికి కలకత్తా వెళ్లవలసిన అతులుడుగూడా, ఈ హడావుడి విని, చిన్నత్త చని పోయిందేమో ననుకొని, ఆదరాబాదరా వచ్చాడు.

మాడిపోయి, లజ్జాభారంతో వంగిన జ్ఞానద ముఖాన్ని అతులునికి చూపుతూ స్వర్ణమంజరి ఇలా అన్నది:

'అతుల్ బాబూ! ఒక్కసారి దీని పాడుముఖాన్ని చూడు. ఈ ముండమోపి ముఖాన్ని, కోతిముఖాన్ని, దగుల్బాజీముఖాన్ని, దరిద్రపు గొట్టుముఖాన్ని, ఒక్కసారి చూడు నాయనా! ఒక్కసారి చూడు.'

జ్ఞానద అలంకరణ చాలా వికృతంగా ఉన్నది. పెదిమలకు వేసుకో వలసిన రంగు చెంపలకు వేసుకొన్నది. చెంపలకద్దు కొనవలసిన రంగు, గడ్డం క్రింద పులిమింది. బొట్టు, జుట్టులో పెట్టుకొన్నది. చాలా కాలంనుండి నూనె ముఖమెరుగని వెంట్రుకల మీద సీసాడు నూనె దిమ్మరించు కోవడం వలన, అది కారి, చెంపల మీదుగా, మెడను, భుజాలను తడిపి వేసింది. చూడటాని కొచ్చిన ఆడవారు ఫక్కున నవ్వారు. ఎగతాళి చేశారు. అతు లుడు గతుక్కు మన్నాడు. అతను విన్నది; జ్ఞానద వ్యాధి పీడితయై, వికృతా కారాన్ని పొందిందని మాత్రమేగానీ, ఇంతలా అయిఉంటుందని ఊహించ లేదు. అయినా, అందరికీ కనిపించే అంత వికారంతో బాటు, మరెవ్వరూ చూడలేని, 'సౌందర్యం' ఆమెలో అతులుడు చూడ గల్గుతున్నాడు.

ఒకనాడు జ్ఞానద తనకుచేసిన మహోపకారం అతులుని స్మృతి పథంలో మెరిసింది. ఏదో అనాలని ప్రయత్నించాడు. స్వర్ణమంజరి గర్జన ధ్వని, ఆ ప్రయత్నాన్ని వమ్ము చేసింది.

అమ్మ లక్కలందరూ, ఎవరికి తోచినవి వారని వెళ్లారు.

జ్ఞానద భారంగా లేచి నిలుచున్నది. ఇంతవరకూ, ఇతురుల ముందామె ఏడ్చి ఎరుగదు. కానీ ఈనాడాపనిగూడా చేసింది. ఎంత ప్రయత్నించినా, అతులుని ముందు, దుఃఖించకుండా ఆమె ఉండలేక పోయింది. ఎటూ చూడలేదు. ఎవ్వరితోనూ మాట్లాడ లేదు. కన్నీ రద్దుకొంటూ, లోపలి కెళ్ళి పోయింది.

బండి దాటిపోవడం వలన అతులుడు తిరిగిఇంటి ముఖం పట్టాడు. ఒక నాడు చిన్నత్త తనతో చెప్పిన మాటలు మనస్సును కలచి వేశాయి. ఆనాడామె ఏమన్నదంటే:—

'రత్నాన్ని విసిరి పారేసి, గాజు ముక్కను జాగ్రత్త పరుచుకొన్న వారు, మనస్తాపానికి గురి కావలసి వస్తుంది. అంతదాకా రానవసరం లేకుండా ముందే జాగ్రత్తపడడం మంచిది!'

సరిగ్గా ఈమాటలే గాకపోయినా, ఇదే అర్థాన్ని, చిన్నత్త బోధించిందానాడు. కానీ, ఆనాడా అర్థాన్ని తను అర్థంచేసుకో లేకపోయాడు. తన నుద్దేశించే, చిన్నత్త ఆమాట లన్నదని, ఈనాడు అతులుడు గ్రహించాడు.

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. అనాథ నాథుడు అతులుణ్ని లేపాడు.

'ఏమిటి మామయ్యా?' అన్నాడు కళ్లు నులుముకొంటూ అతులుడు.

'చిన్నవదిన చనిపోయింది, దహనం చెయ్యాలి.'

'పద' ఇప్పుడే వస్తున్నాను.'

దాదాపు, సంవత్సరం నగ్రిందట, ఏతులసి కోటవద్ద, జ్ఞానద తండ్రి కాళ్ళు పట్టుకొని, ఎలా కూచున్నదో, ఈనాడూ అక్కడే, అదేవిధంగా, తల్లి కాళ్ళుపట్టుకొని ఆమె కూచుని ఉన్నది.

శవంవెంట జ్ఞానదగూడా శ్మశానానికి వెళ్ళింది విచార వాహినిలో మునకలు వేస్తున్న ఆమెను, ఓదార్చే వారెవ్వరూ వెంట లేరు, ఉండాలన్న ఆలోచన గూడా ఎవ్వరికీ రాలేదు,

తల్లిగారి అంత్యక్రియలు జ్ఞానద ఎలాగో పూర్తి చేసింది. చితి భగభగ మంటూ మండుతున్నది. మంటలు కోరలు సాచి, చుట్టు ప్రక్కల నున్న వారిని అందుకో చూస్తున్నాయి. జ్ఞానద, ప్రక్కనే ప్రవహిస్తున్న గంగా నది ఒడ్డున చదికిల బడ్డది. బిగ్గరగా ఏడ్వను గూడా ఏడ్వలే నంతటి విచార మామెను క్రమ్మి వేసింది.

వర్ష ఋతువుగావడం మూలాన, గంగానది, గంభీరంగా ఉరకలు వేస్తున్నది. జ్ఞానద అలా నీటి ఒడ్డున కూచుని ఉండడాన్ని అతులుడు గమనించాడు. అతనిమనస్సు కలవర పడ్డది. అలా కూచోవద్దని చెప్పాలనుకొన్నాడు. దాపులో కూచుని, ఆమెను ఓదార్చా లనుకొన్నాడు. అనుకొన్నాడే గానీ, ఈ రెండూ అతను చెయ్యలేదు.

దూరంగా చిట పట లాడుతూ ఉన్నది చితి. అతని కన్నో ఆలోచనలు కలిగాయి.

'నిన్న ఉన్నది, ఈ నాడు లేదు. నిన్నటి సత్పదార్థం— ఈ నాడు అసత్తు అయిపోయింది. ఏది స్థిరమని మానవు డనుకొంటున్నాడో, అదంతా అస్థిరంగా కాలం నిర్ణయిస్తున్నది. నిన్న జీవంతో పింపెసలారుతూ, కళకళ లాడుతున్న శరీరం, ఈ నాడు, క్రమంగా కాలిపోతూ రూపరుతున్నది. సజీవంగా ఉన్నప్పుడున్న ఆశలు, ఆశయాలు, నిరాశలు, వాంఛలు, అను రాగాలు, విద్వేషాలు, ఇప్పు డేమవుతాయి? ఎక్కడి కెడతాయి? ప్రాణం ఉండగా ఉండి, తదనంతరం అంతర్హితమయ్యే, ఈభావ సముచ్చయపు విలువెంత? ఆలోచనల మూల్యమెంత? చనిపోవడం! ఎంత చిత్రమైన పరిణామం జీవికి! చనిపోవడమంటే ఏమిటి? అది జరగడానికి ఎంతకాలం పడుతుంది?'

ఇలా ఆలోచిస్తున్నాడు అతులుడు. మూడేళ్ళ క్రిందటి తన శిథిల జీవితం గుర్తుకొచ్చింది. మృత్యుముఖంలోకి వెళ్ళిగూడా, తను బైటపడ్డాడు. అందుకు కారణం జ్ఞానద.

'చనిపోతున్న నన్ను, అలా చావకుండా, తనసేవా మృతాన్ని ప్రోక్షించి, బ్రతికించింది జ్ఞానద. ఈనాడామె గంగా ప్రవాహం ఒడ్డున, నిశ్చల, నిరీహా, నీరస, నిర్నిమేష లోచనాలతో కూర్చున్నది.' అను

కొన్నాడు అతులుడు. 'లోకంలో, గణనకు రావలసింది ఒక్క రూపమే కాదు. మూడేళ్ళ క్రితం, ఎందుకూ పనికిరాని తన రూపానికి, జ్ఞానద అమూల్యమైన సేవ చేసింది. ఆనాడు ధనవంతులు, వారి తాతలు కూడా, తన కేసి చూడలేదు. తన యోగక్షేమాలు కనుక్కోలేదు. కానీ, ఈఅంద వికారమైన జ్ఞానద, జ్ఞానహీనమైన జ్ఞానద, ఏరంగు ఎక్కడ అద్దుకోవాలో, బొట్టెలా పెట్టుకోవాలో తెలియని జ్ఞానద, తనను రక్షించి ప్రాణదానం చేసింది. ఆనాడు జ్ఞానద అలా సాహసించకపోయి నట్లయితే, తను ఏమయి ఉండేవాడో ఊహించటం దుస్తరం!'

క్రమంగా క్షణాలు, నిమిషాలు, గంటలు గడిచి పోతున్నాయి. చితి ఆరి పోయింది. ఆరిపోయిందన్న సంగతి అతులుడు గమనించ లేదు. నిశ్చలంగా గంగానది ఒడ్డున కూచున్న జ్ఞానదను తదేకంగా చూస్తున్నాడు.

'అతుల్ బాబూ!' అన్నాడు అనాధ నాధుడు. 'ఇంకా ఇక్కడే కూచున్నావేం నాయనా! రా. ఇంటికి వెళదాం. ఇంకా చేయవలసిన పనులు చాలా ఉన్నాయి!'

'పదండి.'

అతులుడు లేచి నిలబడ్డాడు. అప్పుడే మసక చీకటి పడుతున్నది. ఆ మానిమాపు వేళ, అతని దృష్టి, పగిలిన గాజు ముక్కల మీద ప్రసరించింది. ఆ గాజులు తను ఇచ్చినవే. ఇంత కాలమూ వాటిని ప్రాణప్రదంగా దాచుకొన్న జ్ఞానద, ఇప్పుడు తనే వాటిని విసర్జించింది. అతులుడు గబగబా వెళ్ళి, ఆ గాజు తునకలను ఏరి, జ్ఞానద వెనుక నిలబడ్డాడు. పాదధ్వని విని, వెనుదిరిగి చూచింది జ్ఞానద. ఆమె చెయ్యి పట్టుకొందా మనుకొన్నాడు అతులుడు. కానీ ఆ ధైర్య మతనికి లేక పోయింది.

'జ్ఞానదా! పొరబడట మనేది మానవుని స్వభావం.' అన్నాడు అతులుడు గాజు ముక్కల్ని జ్ఞానదకు చూపిస్తూ. 'ఏ గాజులను నువ్వు తుత్తునియలు చేసి పారేశావో, వాటిని నేను ఏరి తెచ్చాను.'

'ఎందుకు?'

'జ్ఞానదా!' అన్నాడు అతులుడు కళ్ళంట నీరు కారుస్తూ 'ఇప్పుడే ఆరిపోయిన ఈ చితిలో, నేనొక సత్యాన్ని చూచాను, బలవంతంగా, పట్టు

దళ కొద్దీ గాజులను బ్రద్దలు కొట్టవచ్చుగానీ, మన మధ్య గల సత్సంబంధాలను, అనురాగాన్నీ ఎవ్వరూ బ్రద్దలు కొట్టలేరు జ్ఞానదా! అవి, ఇప్పుడూ, ఇక ముందు గూడా చాలా భద్రంగా, చెక్కు చెదరకుండా, ఆరోగ్యంగా ఉంటాయి. నేను చేయలేని కార్యాన్ని, నువ్వు చేయలేవని, నేనిప్పుడు గ్రహించాను. మన ప్రేమకు చిహ్నంగా ఉన్న ఈ గాజు ముక్కల్ని ఏరుకొని ఇంటికి వెడుతున్నాను.'

'జ్ఞానద నిశ్చలంగా చూస్తున్నది. అతులుడు, ఆమె శుష్క హస్తాలను తన చేతులలోకి తీసుకొని, గుండెల కద్దుకొన్నాడు.

'జ్ఞానదా! నే నేమయినా తప్పులు చేస్తే చేసి ఉండవచ్చు. కాదనను. అపరాధిని గదానని, నన్ను దండించడానికి ప్రయత్నించకు. నా తప్పులన్నిటినీ నువ్వు భరించి తీరాలి. అది నీ ధర్మం. నన్ను కాదనే, హక్కు నీకు లేదు. ఆశక్తి గూడా నీకు లేదు.' అన్నాడు అతులుడు గాద్గదికంగా.

జ్ఞానద మాట్లాడ లేదు. నిశ్శబ్దం ఇద్దరి మధ్యా అలముకొన్నది. కొన్ని క్షణాలు గడిచాయి. జ్ఞానద చేయివదిలి, అతులుడిలా అన్నాడు:

'జ్ఞానూ! పోదాం పద! వాళ్లీపాటికి చాలా దూరం వెళ్ళి ఉంటారు.'



తప్పక చదవండి!

## స్త్రీ బుద్ధి...
## జీవితం!

[కథల సంపుటాలు]

రచన: సౌదేశ్వరీదేవి

మానవ మనస్తత్వాన్ని శోధించి, సజీవపాత్రలతో, జీవితంలోని వివిధ సంఘటనలను చిత్రించిన ఉత్తమ కథలు.

ఒక్కొటి రు. 0-8-0



## సినీతార దుర్మరణం
## భామా కలాపం

[డిటెక్టివ్ నవలలు]

రచన: దాసు

మిమ్ములను ప్రతిక్షణం భయభ్రాంతులను చేసే, సంఘటనలతో, అపూర్వమైన ఇతివృత్తాలు గల ఉత్తమ డిటెక్టివ్ నవలలు.

ఒక్కొటి రు. 0—8—0 లు.

రు. 2—8—0 లు పంపినవారికి పై నాలుగు పుస్తకాలు రిజిస్టర్డు పోస్టులో పంపబడతాయి.

వివరాలకు:

## జ్యోతి కార్యాలయం

మద్రాసు — 17.

ARAKSHANEEYA 8 As. 'SARAT'